# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 10
సంచిక: 9

జూలై. 1966
ఆషాఢ-శ్రావణ 1888 శా. శ.

ప్రధాన సంపాదకులు :
టి. రామచంద్రరావు

సంపాదకులు:
కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి.

## ఈ సంచికలో



మొదటి చిత్రం : జల విహారం
ఫోటో : ఎస్.ఆర్.కె. రావు

రెండవ చిత్రం : సుందర పల్లెసీమ

మూడవ చిత్రం : సాగర తనయులు

నాలుగవ చిత్రం : నృత్య శేఖర
ఫోటోలు : ప్రధాన సంపాదకులు



# కుటుంబ నియంత్రణ చేయండి

కుటుంబ నియంత్రణ చిరకాలంగా తెర మరుగునే వుండి పోయింది. కాలగతిలో ప్రపంచమంతటా జనాభా పెరిగేకొలదీ ఈ సమస్యకూడా వెలుగులోకివచ్చి, ఇటుపై ఏమాత్రం అలక్ష్యం చేయ దగని అవసరం ఏర్పడింది. ఈ విషయమై ప్రజలు బాగా తెలుసు కున్నారు. రహస్య విషయమేమీ కాదని అర్థం చేసుకున్నారు. ఇది బాగా ప్రచారంలోకివచ్చింది. సంతాన నిరోధాన్ని కాస్త నాజూకుగా కుటుంబ నియంత్రణ అని పిలవడం మొదలుపెట్టారు. ఆర్థిక ప్రగతికీ, వ్యక్తిగత ఆరోగ్యానికీ యిది చాలా అవసరమని ప్రజలు గుర్తించడంవల్లనే యీ మార్పు సాధ్యమైంది.

ప్రపంచంలో అధిక జనాభా గల దేశాలలో భారతదేశం ద్వితీయస్థానం వహిస్తుంది. ప్రపంచ విస్తీర్ణంలో మనదేశ విస్తీర్ణం 2.2 శాతం మాత్రమే వున్నప్పటికీ ప్రపంచంలోని మొత్తం జనాభాతో పోల్చిచూస్తే మన దేశపు జనాభా 12.8 శాతం వుంటుంది. మన దేశంలో గంటకు 1300 మంది పిల్లలు పుడుతున్నారు. అంటే రోజుకు సుమారు 31000 మంది జన్మిస్తున్నారన్నమాట. ఈ లెక్కన ఏడాదికి మన దేశంలో 120 లక్షల మంది పుడుతున్నారు. పంచవర్ష ప్రణాళికల క్రింద విస్తృతంగా వైద్యసౌకర్యాన్ని కల్పించడంవల్లా, ప్రజారోగ్య చర్యలను చేపట్టడం వల్లా క్రమక్రమంగా మరణాల సంఖ్య తగ్గుతూవస్తోంది. గత రెండు దశాబ్దాలలోనూ మన దేశంలో సాధారణ మానవుని జీవన ప్రమాణం 40 సంవత్సరాల నుంచి 60 సంవత్సరాలకు పెరిగింది. ఇది చాలా శుభదాయకం. నిజానికి జనాభా పెరుగుదల, యిబ్బంది కలిగించేదైనప్పటికీ జీవనప్రమాణం పెరగడం అభిలషణీయం, ఆనందదాయకమూను.

ఇక్కడ ప్రస్తావిస్తున్న జనన మరణాల వివరాలనుచూస్తే యీ సమస్య ఎంత జటిలమైనదో అర్థం కాగలదు.

| సంవత్సరం | జనాభా లక్షలలో | | మరణాలు |
|---|---|---|---|
| 1965 | 484 | 1,000కి | 11 మంది |
| 1975 | 620 (అంచనా) | 1,000కి | 8 మంది (అంచనా) |
| 1985 | 841 (అంచనా) | 1,000కి | 6 మంది (అంచనా) |

ఈ రకంగా మన జనాభా పెరుగుతూపోతే మరో యిరవై ఏళ్ళలో మనదేశ జనాభా రెట్టింపు అవుతుంది. ప్రస్తుతం 1000 కి 41 చొప్పునవున్న జననాల రేటు స్థాయిని ఎంతత్వరగా వీలయితే అంతత్వరగా 1000 కి 25 స్థాయికి తగ్గిస్తేనే కానీ, అందుకు తక్షణమే చర్యలు తీసుకుంటేనేగాని దేశానికి భవిష్యత్తు లేదు. ఆర్థిక ప్రగతి క్రింద ఎంతసాధించినా ఒకదాన్నొకటి హెచ్చించుకుంటూ పోతున్న జనాభావల్ల ఏమాత్రం ప్రయోజనం వుండదు.

ఈ విషమ పరిస్థితిని అవగాహన చేసుకుని కుటుంబ నియంత్రణకు దేశవ్యాప్తంగా తీవ్రమైన విస్తృత కార్యక్రమాన్నొకదానిని భారత ప్రభుత్వం ప్రారంభించింది. గత పదిహేనేళ్ళలోనూ యీ సమస్యను పట్టుదలగానే ఎదుర్కోవడం జరిగింది. తొలి ప్రణాళికలో కుటుంబ నియంత్రణకై రూ. 15 లక్షల్ని వెచ్చించగా; ద్వితీయ ప్రణాళికలో రెండుకోట్ల రూపాయల్ని వెచ్చించారు. తృతీయ ప్రణాళికలో యీ మొత్తాన్ని రూ. 7.5 కోట్లకు పెంచడం జరిగింది. అయినా అసలు సమస్యను మనం తడపనైనా లేదు. ఇప్పుడు దీనిని అత్యవసరంగా మనం చేపట్టకపోతే యీ సమస్య

మనల్నే కబళించివేస్తుంది. అందువల్ల చతుర్థ పంచవర్ష ప్రణాళికలో రూ. 95 కోట్లను కుటుంబ నియంత్రణ నిమిత్తం వెచ్చించాలని భారత ప్రభుత్వం ఉద్దేశించింది. అవసరమైతే యిందుకు మరింత ఎక్కువగా నిధులు కేటాయించబడతాయి.

ఇంతవరకు తీసుకున్న చర్యల్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. ఒకటి - స్వచ్ఛంద సంతాన నిరోధక చర్యలు. రెండు — శస్త్ర చికిత్స చర్యలు. వీటిలో మొదటిది అటు పురుషుల్లోను, యిటు స్త్రీలలోను బహుళ ప్రచారంలోవుంది. శస్త్ర చికిత్సలు చాలావరకు మగవాళ్ళకు మాత్రమే — అదిన్నీ కొన్ని ప్రత్యేక క్లినిక్కులలో మాత్రమే — జరుగుతుండేవి. ఇప్పుడు డా॥ లెప్పీ 'లూప్' విధానాన్ని కనిపెట్టడంతో కుటుంబనియంత్రణలో ఒక కొత్తశకానికి నాందిపలికినట్టయింది. లూప్ అనేది అతి సామాన్యమైన ప్లాస్టిక్ పరికరం. నామమాత్రపు ధరకు కొద్దిపాటి వ్యవధిలో వేలకొలది వాటిని తయారుచేయవచ్చు.

ప్రతి క్రొత్త విషయంలో సాధారణంగా వ్యక్తమయ్యే అపోహాలు, కలిగే అవరోధాలు మాదిరిగానే యీ క్రొత్త విధానంలోకూడ ప్రజలు సందేహాలు వ్యక్తంచేశారు. అయితే "లూప్" మార్గం సురక్షితంగా అనుసరించదగిన విధానమని అనుభవంద్వారాను, పరిశోధనలద్వారాను త్వరలోనే ధ్రువపడింది. ఉపయోగించేవారి శారీరక, మానసిక పరిస్థితుల కారణంగా 5 శాతం కేసులలో "లూప్" విధానంవల్ల అసంతృప్తికరమైన ఫలితాలు కలిగాయని చెప్పబడుతున్నది. "లూప్"ను వినియోగించేవారికి సహాయపడడానికి అవసరమైన సుశిక్షితులైన సిబ్బంది కొరతను నివారించడం ప్రస్తుతం క్లిష్ట సమస్యగాఉంది. ఈ సమస్యను అధిగమించడానికి భారత ప్రభుత్వం దిగువ చర్యలను తీసుకుంటున్నది.

(1) ఆర్థిక ప్రోత్సాహం కలిగిస్తూ ప్రైవేటు మెడికల్ ప్రాక్టీషనర్ల సేవలను వినియోగించుకోవడం.

(2) దేశం మొత్తంలో ఒకేసారి డాక్టర్లకు, నిపుణతగల సిబ్బందికి "లూప్" విధానం నిర్వహించడంలో శిక్షణ యివ్వడం.

(3) ఇష్టపూర్తిగా యీ మార్గాన్ని అవలంబింప జేయడానికి వీలుగా ప్రజలను సిద్ధం చేయడంలో అనధికార స్వచ్ఛంద సంస్థల సహకారాన్ని పొందడం.

(4) ఈ సమస్య తీవ్రతను, అవసరాన్ని అర్థంచేసుకుని, యీ పథకాన్ని విజయవంతం చేసే విధంగా సమాచారం అందచేయడంలో కేంద్ర రాష్ట్ర ప్రచార శాఖల కృషిని తీవ్రతరం చేయడం.

ప్రతి రాష్ట్రంలోని అన్ని కేంద్రాలలో అవసరమైన సంఖ్యలో ఉచితంగా "లూప్"లను సరఫరా చేయడానికి పథకం తయారుచేశారు. దిగుమతులపై ఆధారపడడానికి బదులుగా అధిక సంఖ్యలో లూపులను తయారు చేయడానికి కాన్పూరులో ఒక ఫ్యాక్టరీని నెలకొల్పారు.

దేశమంతటా విస్తృత ప్రాతిపదికపై యీ పథకం అమలుచేయుటకు ఉద్దేశించడానికి కారణం, స్వచ్ఛంద మార్గాలను, శస్త్ర చికిత్సా విధానాలను విడనాడడానికి కాదు. స్వచ్ఛంద సంతాన నిరోధక సాధనాలు, లూపులు స్త్రీలవిషయంలో ఉపయోగపడితే, శస్త్ర చికిత్సా విధానాలు ముఖ్యంగా పురుషులకు ఉపయోగపడ్తాయి.

ఇక మన ఆంధ్రప్రదేశ్‌లో 1951 లో జనాభా 3.1 కోట్లు ఉండగా 1961 సం॥ జనాభా లెక్కల ప్రకారం 3.6 కోట్లు ఉన్నది. పది సంవత్సరాల కాలంలో 15 శాతం పెరుగుదల కనిపిస్తున్నది. అఖిల భారత స్థాయిలో యీ సంఖ్య తక్కువే అనడంలో సందేహం లేదు. అయినా యిది హెచ్చు స్థాయిలోనే ఉన్నది. ఈ పెరుగుదల యీ విధంగానే కొనసాగేపక్షంలో మన రాష్ట్ర జనాభా 1971 లో 4.6 కోట్లకు 1981 లో 5.4 కోట్లకు పెరుగుతుంది. 20 సంవత్సరాలలో 50 శాతం జనాభా పెరుగుదల, మన రాష్ట్ర ఆర్థిక పురోభివృద్ధికి తీవ్ర ప్రతిబంధకంగా అవుతుంది. అఖిల భారత స్థాయిలో తలసరి సగటు ఆదాయం రు. 368/-లు ఉండగా మన రాష్ట్రంలో రు. 333 లు ఉంది. రాష్ట్ర ఆదాయాన్ని రెండింతలు చేయని పక్షంలో వచ్చే పదేండ్లలో కూడా మనం అఖిల భారత స్థాయికి చేరుకోలేక పోవచ్చుననే ఆందోళన కలుగుతున్నది. దీన్ని సాధించడమే చాలా కష్టం. ఇదే కాలంలో జనాభా పెరుగుదల విపరీత స్థాయికి చేరుకుంటే యిక మన రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయాన్ని ఎక్కువ చేసే అవకాశాలు సన్నగిల్లుతాయి. అందువల్ల భారత ప్రభుత్వం అనుసరించిన విధానాలను మనంకూడ ఆచరించి ప్రధానంగా యీ సమస్యను పరిష్కరించడం చాలా అవసరం.

ప్రస్తుతం నగరాలలోను, పట్టణాలలోను 306 గ్రామీణ కుటుంబ నియంత్రణ కేంద్రాలు, 65 పట్టణ కుటుంబ నియంత్రణ కేంద్రాలు ఉన్నాయి. వీటికి తోడు హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరాలలో 49 కుటుంబ నియంత్రణ కేంద్రాలు ఉన్నాయి. ఈ కేంద్రాలలోను ప్రభుత్వ ఆసుపత్రులు, డిస్పెన్సరీలలోను లూప్ విధానాన్ని నిర్వహిస్తారు. రాష్ట్రంలోని మూరుమూల ప్రాంతాలవరకు యీ పథకాన్ని విస్తరింపజేసే విధంగా గ్రామ స్థాయి వరకు యీ విధానాన్ని తెలుపడానికి రాష్ట్రం మొత్తంలో ఉద్యమాన్ని నిర్వహిస్తున్నారు.

వ్యక్తి, కుటుంబంతో సన్నిహిత సంబంధం కలిగి ఉన్న కారణంగా అతడు యే చర్య తీసుకున్నప్పటికీ యీ పథకం విజయవంతం అవుతుంది. ఇది ప్రజల సహకారంపై ఆధారపడి ఉన్నదని నేను పేర్కొంటున్నాను.

ఆంధ్రప్రదేశ్ ప్రజలు యీ పథకానికి తమ హృదయపూర్వక సహకారాన్ని అందజేస్తారని ఆశిస్తున్నాను.

కాసు. బ్రహ్మానందరెడ్డి

ముఖ్యమంత్రి.

# WHAT'S CHARMINAR GOT THAT NO OTHER INDIAN CIGARETTE HAS?



WORLD CLASS.

THAT'S WHAT!




Among the world's top 20 cigarettes, India's billion-seller has what it takes to give *real* smoking pleasure. The secret is in its tobaccos. They're deep brown...rich. Just like the tobaccos in the world's ten most popular brands. Remember, Charminar tobaccos are specially developed. And, triple matured. They give every Charminar a flavour that's rich...a taste that's unique. If you smoke Charminar, you know what we're talking about. If you don't, find out for yourself—*today!*

**There's nothing like Charminar—India's greatest cigarette!**



A VAZIR SULTAN PRODUCT

CMVS-14

# బ్రతికిన కాలేజి

## 15

''పాత ప్రతిలో కొన్ని మార్పులు చేస్తే మంచిదని తోచింది. మంచిదే కాదు, అవసరమనికూడా. ముఖ్యమైనది — మనకి అన్ని విధాలా ఆప్తులైన మన 'బాబాయి గారికి నాటకంలో పద్యాల పాత్ర ఒకటి సృష్టిస్తే మంచిదని తోచింది.''

కల్యాణి బొమలు ముడివేసి వింటోంది. ఇదంతా ఆమెకేదో అనవసరపు బెడదలా అనిపించింది. నృత్యనాటకంఅంటే ఏమిటో అది జనానికి ఏవిధంగా నచ్చుతుందో, ఆమె కేమీ అంతుపట్టడంలేదు. కాని రాధకి మట్టుకు ఎంతవింత ప్రణాళికలైతే అంత బాగా నచ్చుతాయి.

''ఏవండీ, నెమలి తు రా యి తో స హా శ్రీకృష్ణుడి వేషంవేస్తే ఆయనకి!'' అంది అతిఉత్సాహంగా.

''ఆయనకి శ్రీకృష్ణుడివేషం వేస్తే, మీ ఇద్దరికీ ఏ పౌరాణిక స్త్రీల వేషాలో వెయ్యాలి. కథంతా ఏ బృందావనంలోనో జరగాలి,'' అన్నాడు మిస్టర్ చింతా.

''అక్కర్లేదండి. కథంతా మీరుచెప్పి నట్టే. అందులో మార్పేమీలేకుండానే నేను చెప్పేది'' అంది రాధ.

ప్రస్తుతకాలానికి సంబంధించిన కథలో కృష్ణుడు, నెత్తిని నెమలిఫించంతో, చేత మురళితో ఎలా ఇముడుతాడో మిస్టర్ చింతాకి అంతుపట్టలేదు. అతడు తన జీవితంలో ప్రప్రథమంగా తెల్లబోయి చూశాడు.

''మీరు చెప్పిన ఆఖరుఘట్టం ఉందే, అందులో యువతులు యువకుల్ని ఈసడిస్తారు— యువకులు సత్యాగ్రహం చేస్తారు- యువతులు వాళ్ళని దూషిస్తారు. యువకులు తమని అర్థంచేసుకోమంటారు. ఈ విషమ పరిస్థితిలో శ్రీకృష్ణుడు ప్రత్యక్షమైతే?-''

మిస్టర్‌చింతా కళ్ళప్పగించి చూశాడు. తాడూ బొంగరంలేని కథలల్లడంలో తన్ని మించినవాళ్ళే లేరని గర్వం అతనికి. రాధ ఈ విషయంలో తనకన్నా ఏడాకులెక్కువ చదివిందని అతనొప్పుకోక తప్పలేదు.

''బ్రిల్లియంట్'' అని మాత్రం అన గలిగాడు.

''ఇలాంటి పిచ్చినాటకాల్లో మామయ్య గారొక్కనాటికీ వేషంవెయ్యరు,'' అంది కల్యాణి.

**పాలగుమ్మి పద్మరాజు**

''క్షమించండి. ఆయన అనుమతి పొందిన మీదటే నేను పాతప్రతిలో మార్పులు చెయ్యడానికి పూనుకున్నాను. మిస్ రాధా! మీరు సూచించిన మార్పుందే-నాటకానికి ఆయువు పట్టనుకోండి, అద్భుతం. మీరిద్దరూ ఆపక్కని- మేమిద్దరం ఈ పక్కని, మంచి టెంపోలో నడుస్తుంటుంది నాట్యం. వాగ్యుద్ధం తీవ్రంగా సాగుతుంటుంది- అప్పుడు హఠాత్తుగా 'ఢాం' అని చప్పుడు! ఆడియన్సుతో పాటు, మనం నలుగురం కూడా నిశ్చేష్టులమై నిలబడిపోతాం. తెరమధ్య నాలుగు పాయలుగా చీలిపోతుంది-శ్రీకృష్ణ భగవానుడు అందులోనిలబడి అభయహస్తం ఎత్తుతాడు. ''బిడ్డలారా!'' అంటాడు.

''హార్మోనియం కాఫీరాగంపై స్థాయి అందిస్తుంది.

''మగువల్లారా మీకిది

తగవా మగవారువచ్చి దాసోహముసే

యగ తగునా ఇటులనగా—

చూశారా? కవిత్వం దానంతటది పుట్టుకొస్తోంది, ఘట్టం తలుచుకుంటేనే-పద్యాన్నింకా చిత్రిక పట్టాలనుకోండి. మిస్‌రాధా! అసలు మిమ్మల్ని దగ్గర పెట్టుకుని నాటకమంతా తిరగరాయాలి. పాతదంతా మరిచిపోయి రాస్తే మరీ బాగుంటుంది. మిస్ కల్యాణికూడా సలహాలివ్వాలి,'' అన్నాడు మిస్టర్ చింతా.

''ఇదేమీ జరిగేదికాదు. ఈవేళ మేం బయలుదేరి ఇంటికి వెళ్ళిపోవాలి,'' అంది కల్యాణి కుర్చీలోంచిలేస్తూ. అంటే మిస్టర్ చింతా వెళ్ళిపోవచ్చునని ఆమె సూచన.

''అదేమిటే అక్కయ్యా. ఇంతమంచి అవకాశం వొదులుకుంటే మళ్ళీ దొరకొద్దూ,'' అంది రాధ.

### జరిగిన కథ

పెద్దలకు నచ్చక పెళ్ళిచూపులాగినా అబ్బాయి పట్టామాత్రం అమ్మాయి రాధనే పెళ్ళి చేసుకోవాలని అనుకొని, స్నేహితుడు చింత సలహాతో తండ్రిని ఒప్పిస్తాడు. పెళ్ళిపీటలమీద పెళ్ళికూతురు రాధ కాకపోగా, విరాగియై తిరిగి ఇంటికి వస్తాడు. రాధ, కల్యాణీ, శర్మగారివద్ద నాట్యంనేర్చుకొని రామలింగయ్య సహాయంతో ప్రదర్శన ఇస్తారు. చింతా, పట్టా దీనికి వస్తారు. పట్టా రాధను కలుసుకొనడానికి గ్రీన్‌రూమ్‌కేవెళ్తాడు. అక్కడ కామన్నచేతబాగా దెబ్బలుతిని చివరికి చింతా సలహాపై పుంజుకుని కామన్నని ఒక కొత్తరకం పట్టుతో ఓడించేస్తాడు. కామన్నని చింతాయే అతని ఇంటి దగ్గర విడుస్తాడు. అమర్నాడు వాళ్ళింటికి వెళ్ళి అతని చెల్లెళ్ళయిన రాధ, కల్యాణీలను తను రాసిన నాటకంలో వేషం వేయడానికి ఒప్పిస్తాడు. అంతేకాదు కామన్నను కూడా మంచి చేసుకుంటాడు. రామలింగయ్యను కూడ నాటకంలో యిరికిస్తాడు.

''మనకిచేతనయిన నాట్యమే చేస్తాం'' అంది కల్యాణి.

''వట్టి నాట్యానికి ప్రతి ఫలం తక్కువ. మీ ప్రతిభ పూర్తిగా వికసించాలంటే —''

''ప్రతిఫలం చాలదనితోస్తే అసలు నాట్యమే మానేస్తాం.'' అంది కల్యాణి కచ్చితంగా.

''అక్కయ్యా! అసలు మనమీ ప్రదర్శనాలు ఎందుకు మొదలెట్టాం? మనకాళ్లమీద మనం నిలబడ్డానికి. ఆడపిల్లకి పెళ్లొక్కటే జీవితాశయం కాదని లోకానికి రుజువుచెయ్యడానికి. మగవాళ్లని మనకాళ్లచుట్టూ తిప్పుకుని మన ఆధిక్యం నిరూపించుకోడానికి. సరిగ్గా అదేఇతివృత్తం మీద రాసిన నాటకం ఒకటి మనకి అనుకోకుండా వీరిమూలంగా దొరకుతుంటే వొద్దంటావేమిటే?''

తమ వ్యక్తిగత విషయాన్ని రంగస్థలం మీదికెక్కించడం కల్యాణికి బొత్తిగా ఇష్టం లేదు. అయితే ఆ విషయం మిస్టర్ చింతా ముందు చర్చించడం ఆమెకు అసలే ఇష్టంలేదు. అందుచేత ఆమె చెల్లెలికేమీ సమాధానం చెప్పలేదు.

''మిస్ రాధా! మీ ఆ వేశానికి నాజోహార్లు. అసలు నన్నడిగితే మీ కథలో ఘట్టాలకి నాటకం ఎంత దగ్గరగా ఉంటే అంత బలంగా ఉంటుంది ప్రదర్శనం. అందుకోసం కూడా పాతప్రతి తిరిగి రాయాలని నాకు బుద్ధిపుడుతోంది. మీరు స్వయంగా అనుభవించిన కష్టనిష్ఠూరాలు, మీకంటే ఎవరు బాగా ప్రదర్శించగలరు? మీ సొంత విషయాలు బహిరంగం కావడం మీకంత మనస్కరించకపోవచ్చు. అయితే ఈ సమస్య ఒక్క మీదేకాదు. స్త్రీజాతికంతకీ సంబంధించినది. నిజానికి సమాజానికంతకీ సంబంధించినది. మన ప్రదర్శనలద్వారా, స్త్రీ పురుష సంబంధాల్లో పెద్ద విప్లవమే గనక తేగలిగితే, మీరు పడ్డ ఆవేదన వృధాపోదు. మన కృషి సార్థకమౌతుంది''.

ఈ గంభీరోపన్యాసం ఇచ్చిన తరువాత మిస్టర్ చింతా శలవైనా పుచ్చుకోకుండా వెళ్లిపోయాడు. తను ఎంత ఉదాత్తమైన ఆశయంకోసం ఈ ప్రదర్శనం సూచించాడో కల్యాణి గ్రహించాలని, నాటకంలోలాగ గంభీరంగా నిష్క్రమించాడు. కల్యాణి గ్రహించకపోయినా, రాధ పట్టుబట్టి అక్కగార్ని ఒప్పిస్తుందని అతని నమ్మకం.

ఆ తరవాత రెండు రోజులపాటు దీని విషయమై వాద ప్రతివాదాలు తీవ్రంగా సాగాయి. ప్రతిపాదన కనుకూలంగా రామలింగయ్య, రాధ, ప్రతికూలంగా కల్యాణి. కాని వీటితో తనకేమీ సంబంధం లేనట్టు కామన్న ఆసనాలు వేసుకుంటున్నాడు. మిస్టర్ చింతా తన పని తను చేసుకుపోతున్నాడు.

మిస్టర్ చింతా నాటకంలోలాగ నిష్క్రమించిన తరవాత, కల్యాణి రాధని మందలించింది. రాధ కల్యాణితో ఘాటుగా వాదించింది. ఆ తరవాత రామలింగయ్య వాద ప్రతివాదాల్లో కలిశాడు.

భోజనాల సమయంలోకూడా వాద ప్రతివాదాలు సాగాయి. తరవాతకూడా సాగుతూనే ఉన్నాయి.

మధ్యాహ్నం మూడు గంటలవేళ మిస్టర్ చింతా కారు చప్పుడవగానే వాద ప్రతివాదాలు ఆగిపోయాయి.

మిస్టర్ చింతాతోకూడా, ఆ బరువైన వాతావరణంలోకి, కొంచెం ఖులాసా ప్రవేశించింది.

''గుడ్ ఈవినింగ్, కాగితాలు కలం నా దగ్గరున్నాయి, భావాలూ, పదాలూ మీరు సప్లైయి చెయ్యాలి. బాబాయి! ఈ ఇల్లు మన రిహార్సల్సుకోసమని ఒక నెల అద్దెకు తీసుకున్నాను. ఒక పక్క రాతపనిఔతుంటే మరొక పక్క సంగీతం, డాన్సు అవుతుండాలి. అంచేత ఏర్పాట్లన్నీ చేసేశాను, రేపటినించి సంగీత దర్శకుడు, నాట్యాచార్యుడు వస్తారు.''

''ఇంకా ఒక్క పాటైనా తయారు కాందే,'' అంది రాధ.

''ఎంతసేపు? ఈవేళ ఒక పాటన్నా అవదా? కాకపోయినా ఫరవాలేదు. ముందు ట్యూనూ, డాన్సూ నిర్ణయిస్తే మాటలు తరవాత కూరుస్తాం. మిస్ రాధా! ఆ గదిలో కూచుందాం పదండి. ఇక్కడకెవరన్నా వచ్చి పోతుంటే డిస్టర్బెన్సు.''

ఇంక సమాధానంకోసం చూడకుండా మిస్టర్ చింతా గదిలోకి దారి తీశాడు. రాధ సందేహంగా కల్యాణివంక చూసింది. కల్యాణి నిట్టూర్చింది. రాధ గదిలోకి వెళ్లింది.

''ఏరా అబ్బాయి!'' అంటూ వాళ్లని అనుసరించాడు రామలింగయ్య. కల్యాణి తనకన్నా ఎంత చిన్నదయినా, ఆమెవాలకం చూస్తే కాస్త ఆయనకు జలకు పుట్టింది.

''ఏదో పొద్దున్న ఆశుకవిత్వంగా చెప్పావట నా పద్యం ఒకటి!'' అన్నాడు గదిలో ప్రవేశిస్తూ.

''పద్యమా? ఏం పద్యం?'' అన్నాడు మిస్టర్ చింతా పాట పల్లవి ఆలోచిస్తూ. బండిగాడిలో పడిందనికూడా అతనికి తెలీదు.

''ఒరేయి, నీ ఆటలు నా దగ్గర సాగవురోయి, నా వయస్సుల్లో సగంలేదు నీకు.'' అన్నాడు రామలింగయ్య, అతని చేతులో కాగితం లాక్కుంటూ.

''ఓహో! పద్యమా, ఏదో అన్నాను ఆ ఉత్సాహంలో - దాని తాతల్లాంటి పద్యాలు రాస్తాను బాబాయి,'' అని సర్దుకున్నాడు మిస్టర్ చింతా.

''ముందా పద్యం చదవరా,''అన్నాడు రామలింగయ్య.

''మొదలేమిటి?'' అని వెతుక్కున్నాడు మిస్టర్ చింతా.

''మగువల్లారా....'' అని అందించింది రాధ.

కాఫీలో ఎత్తుకున్నాడు మిస్టర్ చింతా. ఆ రాగం రామలింగయ్యకి అభిమాన రాగమని అతనికి తెలుసు.

''భేష్! బాగా పాడలావే,'' అని మెచ్చుకున్నాడు రామలింగయ్య.

మిస్టర్ చింతా అణకువగా చిరునవ్వు నవ్వి, ''ఏదోలెండి'' అని, కిటికీ వంక తిరిగాడు, పాటకి పల్లవి వెతుక్కుంటూ.

కిటికీ అవతల ''హృదయకుసుమాలు,'' అట్ట, దానివెనక షేక్స్పియర్ ముఖంపెట్టి నిలబడ్డ పట్టూ అతనికంట బడ్డారు. పట్టూ దీనంగా రాధ వంక చూస్తున్నాడు.

''ఆ! నువ్వా'' అంది రాధ.

మిస్టర్ చింతా లేచి అవతలికి వెళ్లాడు.

పోతున్నలాగే పట్టూ చొక్కా పట్టుకుని కారుదాకా లాక్కుపోయాడు మిస్టర్ చింతా.

''ఆమె ఇక్కడుందని తెలిసి నేను చూడకుండా ఎల్లా వుంటాన్రా?'' అన్నాడు క్షమాపణచెప్పుకుంటున్నట్టు. అదృష్టవశాత్తూ అతని గొంతు ఇంట్లో వాళ్ళకి వినిపించలేదు.

''అంచేతే నువ్వింక రావటానికి వీల్లే కుండా ఏర్పాటు చేసేస్తున్నాను. డ్రైవర్! వీణ్ణి మన ఇంటికి తీసుకుపో. తీసుకుపోయి ఏంచెయ్యాలో తెలుసుగా'', అన్నాడు మిస్టర్ చింతా.

"చింతా", అన్నాడు పట్టూబతిమాలుతూ.

"ఫూల్! నీ కోసం ఇంత నాటకం ఆడుతుంటే అంతా గంగలో కలిపేస్తావా. ఇంక నోరెత్తకు''.

కారు కదిలిపోయింది. మిస్టర్ చింతా చేతులు దులుపుకుంటూ (ఏదో దుమ్మైనట్టు) తిరిగి గదిలోకి వచ్చాడు. ఏమీ జరగనట్టు కాగితంతీసి పాట పల్లవి రాసి, రాగవరసని చదివాడు.

''హృదయ కుసుమాలు వాడేనా,

పరిమళాలు వెదజల్లేనా?.''

"ఎల్లా ఉందండి?" అని రాధ నుద్దేశించి అడిగాడు.

ఆమె కెందుకో ఆపాట కిటికీ అవతల నిలబడ్డ యువకుడి గొంతులోంచి అతి బరువుగా వచ్చినట్టు అనిపించింది. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

''అతన్ని పంపించేశారా?'' అంది రాధ.

''పాపం అతన్ని చూస్తే జాలివేస్తుందండి. అయినా మీ కిష్టం లేనప్పుడిల్లా కిటికీని జలగలా అంటిపెట్టుకోడం కూ యమా చెప్పండి."

రాధ జరూరు పనేదో ఉన్నట్టు లేచి వెళ్ళిపోయింది.

మిస్టర్ చింతా రామలింగయ్య వైపు చూశాడు. రామలింగయ్య కొంటెగా నవ్వాడు.

నాట్యం సాధకం చెయ్యడానికి మొదలు పెట్టిన రోజుని, కల్యాణి తన అసమ్మతిని తెలియజేయ్యడానికి కదలకుండా కుర్చీలో కూచుంది. రాధా, రామలింగయ్య ఎంత బతిమాలినా వినలేదు. చేసేదిలేక రామలింగయ్య పద్యాలతో రిహార్సల్ ప్రారంభమైంది. దానికి అనుగుణంగా అడుగులు వేసి చూపించాడు ఉస్తాద్‌జీ సంపత్.

సంపత్ తను ఉత్తరప్రదేశ్‌నించి వచ్చినట్టు నిరూపించుకోడానికి, మధ్య మధ్య హిందీ మాటలు పడేస్తుంటాడు. 'నాట్యాంజలి' అనే స్కూలు ఒకటి అతను నడుపుతున్నాడు. ఆ స్కూలుకి పోషకుల్లో ముఖ్యుడు మిస్టర్ చింతా. యంత్రవాద్యగాళ్లు అతని బృందమే.

''ఠీక్ హైజీ మిస్టర్ చింతా?'' అని అడిగాడు అభినయం చేసి చూపించి.

''ఉస్తాద్‌జీ! అంత క్లిష్టమైన అడుగులు బాబాయి హుందాకి సరిపడవు. చూడండి ఇలా చేస్తే సరిపోతుందేమో-'' అన్నాడు మిస్టర్ చింతా.

అని పద్యాలు పాడుతూ అభినయించాడు మిస్టర్ చింతా.

కల్యాణి ఆశ్చర్యంగా కళ్ళప్పగించి చూసింది. మిస్టర్ చింతా, రామలింగయ్య గారు వేసిన సంగతులు తు-చ-తప్పకుండా పలికించడమే కాదు, గొంతుక కూడా అక్షరాలా ఆయనదే అనుసరించాడు!

''బలే బలే,'' అని చప్పట్లు కొడుతూ చిన్నపిల్లలా ఎగిరి గంతులు వేసింది రాధ.

''ఆరిపిడుగా!'' అని బిత్తరపోయాడు రామలింగయ్య.

జులాయి మనిషిలా కనిపించే ఇతనిలో ఇంత విద్యా, ఇంత ప్రతిభా ఉన్నాయని కల్యాణి తనలో తనైనా ఒప్పుకోక తప్పలేదు. ఒక్కపాటేగాదు ఆ అడుగులు! ఎంత సహజంగా, ఎంత తేలిగ్గా. నాట్యం అనిపించకుండా వేశాడు!

''ఆ తరవాత వాద్యాల మీద రాగప్రస్తారం. అందులో మిస్ కల్యాణి నాట్యభంగిమం-'' అంటూ చేసి చూపించాడు మిస్టర్ చింతా.

మంత్ర ముగ్ధురాలిలాగ లేచి మిస్టర్ చింతా నోటితో రాగం అంటుంటే తను అడుగులు వేసి అభినయించింది కల్యాణి. వెంటనే తనింతసేపూ వాళ్లతో రిహార్సల్సులో సహకరించడం లేదని ఆమెకు గుర్తొచ్చింది. ఆమె ముఖం సంకోచం, సిగ్గూ, తన మీద కోపంతో ఎర్రబడింది.

''బ్యూటీఫుల్! చెక్కిల్లో ఎరుపు, కనుబొమ్మల్లో కోపం, కళ్లలో బాధ, సంకోచం, సిగ్గూ- అవి నావంటి మగపురుగు మీకు చేసి చూపించగలడా? మిస్ కల్యాణీ! మీకు జోహార్లు. మీ పోర్షను నేనుగాని ఉస్తాద్‌జీగాని మీకు చేసి చూపించడం సాహసం. అది మీరే మీకెల్లా బాగుంటుందని తోస్తే ఆ విధంగా నిర్ణయించుకోండి. ఏమంటారు ఉస్తాద్‌జీ?''

''ఠీక్ హై'' అన్నాడు సంపత్.

ఆ తరవాత కల్యాణి ధారాళంగా రిహార్సల్సులో పాల్గొంది. అప్పుడప్పుడు సంపత్ చెప్పిన అడుగులూ భంగిమలూ తను తడుముకుంటూ చేసినప్పుడు, మిస్టర్ చింతా అతిసునాయాసంగాచేసి చూపిస్తే, ఆమెకు ఒకపక్క అసూయా, మరొక పక్క గౌరవం అతని మీద ఏర్పడ్డాయి. అసలు రెండోసారి తనుచెప్పించుకోకూడదని అతి పట్టుదలగా ప్రయత్నించింది ఆ తరవాత.

కాని ఈ భంగిమలన్నీ ముందు తన ఇంటివద్ద సాధకంచేసి, ఆ తరవాత కల్యాణి మెప్పుకోసం, తన ఏకసంతగ్రహణశక్తిని మిస్టర్ చింతా ప్రదర్శిస్తున్నాడని పాపం ఎరగదు.

రెండురోజుల్లో ఆమె సంకోచాలన్నీ పటాపంచలు చేశాడు మిస్టర్ చింతా, రెండో రోజుని ఆమె అడిగింది.

''మీ స్నేహితుడుకూడా వాస్తేనేగాని రిహార్సల్స్ ఎలా పూర్తవుతాయి?"

''లీవిట్ టు మిస్టర్ చింతా,'' అన్నాడు మిస్టర్ చింతా నవ్వుతూ. ఆ తరవాత వివ



రించాడు. “అతను కలకత్తాలో ఉన్నాడు. మన నాటకం మార్పులతో సహా అంతా అతనికి పంపించాను. అతనికి రిహార్సల్ అక్కర్లేదు. నిజానికి, మే మిద్దరం కలిసి మా పోర్షనంతా బాగా సాధకం చేశాం ఇదివరకే.”

నిజానికి నృత్యనాటికలో అయిదో పాత్రధారి మిస్టర్ చింతా ఇంట్లో నిర్బంధంలో ఉన్నాడు!

మిస్టర్ చింతాకి క్షణం తీరికలేదు. ఒకపక్క నృత్యనాటిక రచన పూర్తి చేయించాలి. మొదట కొన్ని పద్యాలూ, ఒక పాటా తనే రాసినా, రిహార్సల్స్ ప్రారంభమైన తరవాత రచనా భారం తన ఆశ్రితులలో ఒక ఆసామీ మీద పెట్టాడు. ఎందుకంటే ఆ పని మీద తను కూచుంటే, అసలు ప్రదర్శనం వెనకపడుతుంది.

అంతకన్నా ముఖ్యమైన పని, రోజులు గడుస్తున్నకొద్దీ, ఆ సోదరీ మణుల ఉత్సాహం సన్నగిల్లకుండానూ, వాళ్ళకిదంతా ఒకనాటకమని అనుమానం కలక్కుండానూ జాగ్రత్త పడాలి. దీనికి ముఖ్యమైన ప్రతిబంధకాలు రెండు. ఒకటి—రామలింగయ్య. అతను ఏ రహస్యమైనా ఎక్కువకాలం మనసులో దాచుకోలేడు. అనుకోకుండానే అనేక సార్లు అసలు రహస్యం బయటపెట్టేసినంత పనిచేశాడు. అయితే మిస్టర్ చింతా అతిచాకచక్యంగా సర్దేశాడు.

“ఒరే అబ్బాయి, ఆ చచ్చుపీనుక్కి ఎంతనేర్పినా అడుగేపడదేవిటో? వాడు ఆఖరికి అంతా అభాసు చెయ్యడు గదా.” అన్నాడొకనాడు, కల్యాణీ రాధల సమక్షంలో. అతను పట్టూని ఉద్దేశించే అన్నాడని మీరు గ్రహించే ఉంటారు.

“అభాసు చేస్తాడా? ఎవడు?” అన్నాడు మిస్టర్ చింతా పరధ్యానంగా. అనగానే, పొరబాటు చేశానని గ్రహించాడు. వెంటనే రామలింగయ్య తపీమని అనేశాడు.

“ఎవడేమిట్రా .... మీ ఇంట్లో.......”

“ఓహో, వాడా,” అని నవ్వులో ఒక పెద్ద హెచ్చరిక జోడించి గట్టిగా అరిచాడు మిస్టర్ చింతా. రామలింగయ్య నాలిక కొరుక్కున్నంత పని జేశాడు. అయినా పొరబాటు మాత్రం జరిగిపోయింది. మిస్టర్ చింతా ఆ నవ్వు కొంతసేపు సాగించి తరువాత దాన్నిసర్ది చెప్పడానికి ఒక కథ ఆలోచించాడు.

“వాడు మా ఉస్తాద్ సంపత్ శిష్యుడు. వాడికి నాట్యమంటే ఒకటే పిచ్చి. పదేళ్ళు సంపత్ కూడా తిరిగినా ఒక్క అడుగువాడికి అబ్బలేదు. సంపత్ నేర్పడం మానేసినా వాడు మాత్రం గురువుగార్ని వొదిలి పెట్టడు. ప్రతీదీ తను చేస్తానంటాడు. అబ్బే! వాడి వల్లేమౌతుందండి? అసలు ఆ సామీ కలకత్తాలో ఉన్నాడని చెప్పాగా? వీడం

టాడు. ఇన్నాళ్ళు డాన్సు సాధకంచేశాడు. ఆ ఛాన్సు పోకొట్టించండి. ఎక్కడో కలకత్తాలో ఉన్న ఆసామీ నెందుకు రప్పించాలి. నా అంతటివాడు మీ అందు బాటులో ఉండగా—అంటాడు. ఆ వేళ వీరొచ్చేసరికి చేసి చూపిస్తున్నాడన్నమాట. సరేవాణ్ణెందుకు చిన్న బుచ్చాలని, కలకత్తా ఆసామీ వస్తాడోరాడో, రాకపోతే పోర్షను నీకే ఇస్తామని చెప్పాం. అప్పటినించీ రోజూ ఇంటి కొచ్చి తన విద్యా ప్రదర్శన లతో చంపుతున్నాడు పిచ్చివాడు''.

ఆ పిచ్చివాడి మీద సానుభూతి నిట్టూర్పు ద్వారా వ్యక్తపరచి, వెంటనే నాటకంలో కొత్త పాట పాడి వినిపించాడు మిస్టర్ చింతా.

రెండో అవాంతరం పట్టూ. ఎంతగదిలో పెట్టి తాళం వేసినా, ఒకనాడు వంట మనిషి అన్నం పట్టుకొచ్చినప్పుడు వాణ్ణి విసిరి పారేసి, పడిపోయిన వాడి మీదినించి గెంతి, పారిపోయి వచ్చాడు. వొచ్చి, మంచి పట్టు దలగా రిహార్సల్ జరుగుతున్నప్పుడు అల వాటైన కిటికీ కింద ప్రత్యక్షమయాడు. అడుగు వేస్తూ అటు తిరిగిన రాధ, ఆగి పోయింది. మిస్టర్ చింతా అటుచూశాడు. అవతలికి వెళ్ళి మళ్ళీ డ్రైవర్ సహాయంతో ఇంటికి పంపిద్దామనుకున్నాడు. కాని రోజూ అదొక కార్యక్రమంగా పెట్టుకుంటే అన్నిటికీ ఇబ్బందే.

''మర్యాదగా వెళ్ళిపోతావా లేదా ?'' అన్నాడు మిస్టర్ చింతా.

''ఇక్కడ నిలబడి చూస్తే మీకేం అడ్డు ? నేను నోరు విప్పితే చెప్పు తీసుకు కొట్టండి. ఊరికే నిలబడతానంటే,'' అన్నాడు పట్టూ దీనంగా.

''పోలీసు రిపోర్టివ్వనా?'' అన్నాడు మిస్టర్ చింతా సోదరీ మణులను ఉద్దేశించి.

''వొద్దు'' అంది రాధ ఆత్రంగా. తీరా అనేశాక ఎందుకన్నానా అనుకుంది. తనన్నది సమర్ధించు కోడానికి, ''ఏమనిస్తాం రిపోర్టు? అతను రోడ్డుమీద నిలబడ్డాడు. రోడ్డు అందిరిదీని. అదీగాక అతనూరికే నిలబడుతున్నాడు. ఏదన్నా అల్లరిచేస్తే పోనీ ....''అంది. అన్నతరవాత అంత దీర్ఘమైన సమజాయిషీ తను ఇవ్వడం అనవసర మనిపించి ఆపేసింది.

కల్యాణికి ఈ ప్రదర్శనానికి స్వస్తిచెప్పి ఇంటికి పారిపోవాలనిపించింది. అందరిమీదా తిక్కొచ్చిందామెకి.

''అతనక్కడ నిలబడి ఉంటే మన రిహార్సల్ ఎల్లా సాగుతుంది.'' అంది. మిస్టర్ చింతా ఆ సమస్యకి పరిష్కారంగా కిటికీ మెడ తలుపులు మూసేసి రిహార్సల్ నడిపించాడు. అయితే సోదరీ మణులిద్దరూ ఆవేళ ప్రతి అడుగుదగ్గరా తడబడ్డారు. ఇద్దరికీ కారణాలు మాత్రం వేరువేరు.

రెండుమూడు రోజులు కిటికీ అవతల పట్టూ నిలబడ్డం వాళ్ళకి అలవాటయార రిహార్సు కొంతదారిలో పడ్డాయి. అయితే మొదట్లో ఉన్నంత సరదా, కులాసామాత్రం లేవు.

మిస్టర్ చింతాకి అన్నింటికన్నా పెద్ద సమస్య, పట్టూకి అడుగులు నేర్పడం. అక్కడికీ పట్టూ పోర్షనంతా వచనంలోనే ఉంది. అది రాగవరసని సంపత్ చదువు తుంటే పట్టూదీనంగా మొహంపెట్టి అభిన యించాలి. పెద్దగా చేతులూకాళ్లూ తిప్ప క్కర్లేదు. అయితే సోదరీ మణులు పాట పాడుతూ నాట్యంచేసినప్పుడు, ఆ తాళానికి అనుగుణంగా మిగతావాళ్లు కూడా అడుగులు వెయ్యాలి. లేకపోతే దృశ్యం వెలితిగా ఉంటుంది. అంతేకాదు, వాళ్లు కసిరికొట్టి నట్టు మీదికివచ్చినప్పుడు తాళానికనుగు ణంగా వెనక్కితగ్గి మోకరించాలి. అది చచ్చినా పట్టూకి చేతకావడం లేదు. ఏ కాలు ముందు వెనక్కివెయ్యాలో, ఏకాలి మీద మోకరించాలో లక్షసార్లు చేసిచూపించినా పట్టూ అవి మళ్ళీ తప్పుగానే చేసేవాడు. కోపాలూ, తిట్లూ ప్రయోజనం లేకపోతే ఆఖరికి మిస్టర్ చింతా అన్నాడు—

''పట్టూ: నీ ప్రేమనుగురించి ఒక్కసారి తలుచుకో. అది సఫలం కావాలంటే ఇది నువ్వు సరిగ్గాచెయ్యాలి. తప్పటడుగు వేశావా, జీవితాంతం ముగ్గురు ప్రాణులు నీ మూలంగా నరకం అనుభవించాలి. సరిగ్గా చేశావా—నీ ప్రేమ ఫలిస్తుంది ఆలోచించుకో. నీజీవితమంతా ఈ ఒక్క అడుగుమీద ఆధారపడి ఉంది. మనస్సంతా దీనిమీద పెట్టి దీక్షతో ప్రయత్నించు. హామ్లెట్ కొచ్చిన సమస్యలాంటిది-ఇది. ''జీవించుటయా, మరణించుటయా. తేల్చుకో. కమాన్ తేల్చుకో.''

పట్టూ నిట్టూర్చి, ''మరణించడమే.'' అని సోఫాలో చతికిలబడ్డాడు.

''అది నీ ఇష్టమా? నీ సమస్య పరి ష్కారం నీ చేతులో ఉందనుకుంటున్నావా. గెటప్. లే, నువ్వు చస్తానంటే మాత్రం మిస్టర్ చింతా చావనిస్తాడని ఆశ పడు తున్నావా. లే ఊ.''

పట్టూ లేచాడు. మళ్లీ ప్రయత్నించాడు. కేవలం అలసటవల్ల-అడుగులు తడబడ్డాయి. తడబడ్డంలో సరిగ్గా తడబడ్డాయి.

''ఇంకే ముంది? వొచ్చేసింది.''అన్నాడు మిస్టర్ చింతా. మరునాడు మళ్లీ మొదలు.

ప్రదర్శనం నాడు సాయంత్రం ఆరు గంటలకు కూడా కలకత్తా నించి రావలిసిన నటుడు రాలేదు. ఆ తరవాత అతను రావడానికి రైలూ లేదు. హౌరా నించి వొచ్చే మెయిలు వచ్చింది, వెళ్లింది.

''ఇప్పుడెలాగ?'' అంది కల్యాణి.

''అదే ఆలోచిస్తున్నాను.'' అన్నాడు మిస్టర్ చింతా.

''డాన్సు మాష్టారు పోనీ వెయ్య కూడదూ ఆవేషం?'' అంది రాధ.

''పాటెవరు పాడతారు? తాళం ఎవరు వేస్తారు? శబ్దం ఎవరు చెబుతారు?''

ఆ ప్రశ్నలకి సమాధానం లేదు. అందరూ దీర్ఘంగా ఆలోచించారు.

''ప్రదర్శనం ఆపేయించండయితే,'' అందికల్యాణి.

''నో, నో,'' అన్నాడు మిస్టర్ చింతా.

తన విషయంలో అన్నీ ఇల్లాగే జరిగాయ నుకుంది కల్యాణి. మొదట పెళ్లి ప్రయ త్నాలు జోరుగా జరుగుతున్నంత సేపూ కూడా, ఆమె మనసులో, ఏదన్నా అవాంతర మొచ్చి ఇది ఆగిపోతుందేమోనన్న అను మానం ఉంది. అలాగే జరిగింది. ఆఖరి క్షణంలో పెళ్లి ఆగిపోయింది. బెంగుళూరు ఉద్యోగం కూడా అల్లాగే అయింది. స్టేష నుకి పోవడానికి బండి కూడా వొచ్చింది.

ఆఖరు క్షణంలో అదీ ఆగిపోయింది. ఇప్పుడిది. ఈ ప్రదర్శనం ఆగిపోతే నిజానికి ఆమె అంత బాధ పడదు. ఆగిపోతే బాగుండునన్న ఆశకూడా ఉంది ఒక పక్కన.

అయితే రాధకిమాత్రం ఈ ప్రదర్శనం జరిగి తీరాలనుంది. ఈ ప్రయత్నం ప్రారంభించినప్పుడు ఆమె దీనిద్వారా మగ వాళ్లమీద కసి తీర్చుకోవచ్చుననుకొంది. కాని రిహార్సల్సు నడిచినకొద్దీ ప్రదర్శనం యొక్క ప్రయోజనం ఆమెకు తెలియకుండానే మారిపోయింది. 'హృదయకుసుమాలు' లోని వచనాలు, వాటికి సంపత్ కూర్చిన సంగీతం, దాన్ని అభినయిస్తున్న అవ్యక్త యువకుడు ఆమెకు నాటకంలో పెద్ద ఆకర్షణలైపోయాయి. రిహార్సలైన తరువాత వాటిని తలుచుకొని తలుచుకొని కన్నీరు కార్చనిరోజంటూ లేదు.

'ఓపనిచేద్దాం.' అన్నాడు మిస్టర్ చింతా, కొత్త ఆలోచన తోచినట్టు.

'ఏమిటి?' అంది రాధ ఆశగా.

'ఉస్తాద్‌జీ శిష్యుడున్నాడని చెప్పానే-రోజూ మా ఇంటికొస్తుంటాడని....'

'మరతనికి డాన్సేరాదన్నారు?'

'రాదంటే మీలాగా, నాలాగా రాదుగాని, అసలేరాదనికాదు. ఎలాగైనా ఇంగువకట్టిన గుడ్డని ఆమాత్రం వాసన అంటకుండా ఉంటుందా? పదేళ్లబట్టి ఉస్తాద్‌జీ శిష్యరికం చేసినవాడు, ఆమాత్రం అడుగువెయ్యలేకపోతాడా? ఫరవాలేదు. కొంచెం పట్టినట్టుంటుంది, అనుమానంగా చేస్తున్నట్టు. అంతకుమించి....'

అల్లా ఉంటే మరీ బాగుంటుందిరా అబ్బాయి,' అన్నాడు అంతవరకూ నోరెత్తని రామలింగయ్య. ఈ ముక్క సమయంచూసి ఆయన అనాలని ముందే నిర్ణయమయింది. ఎలాగైనా నాటకాల అనుభవం ఉన్నవ్యక్తి గనుక అతిసహజంగా అనేశాడు. అయితే నటనలో మిస్టర్ చింతా ఆయన తలదన్నాడు. అతను ముఖంలో ప్రదర్శించిన ఆశ్చర్యం, సంతోషం, నటనంటే ఎవరూనమ్మరు.

'కరెక్ట్. అసలు తప్పటడుగులుకొన్ని పడితే మరీబాగుంటుంది. థాంక్స్ బాబాయి, థాంక్స్. పెద్దసమస్య అతిసులభంగా పరిష్కరించేశారు. అదీగాక ప్రతిఅక్షరం, ప్రతి అడుగూ తెలుసువాడికి, ఒక్కరోజు నాగాలేకుండా వచ్చాడు మాయింటికి, ఉస్తాద్‌జీని చంపి మళ్లీ అక్కడ రిహార్సల్ పెట్టించేవాడు రోజూ. వాడికీ చాన్సుయిచ్చామంటే ఎగిరి గంతెయ్యడూ'.

'ఒక్కసారైనా మనమంతా కలిసి చెయ్యందే....' అని అభ్యంతరం చెప్పబోయింది కళ్యాణి. కాని అప్పటి కప్పుడే మిస్టర్ చింతా కార్లో ఉన్నాడు ఆ ఆసామీని అర్జంటుగా పట్టుకోవాలంటూ.

అయిదో ఆసామీ రాకపోవడం మూలంగా ప్రదర్శనం ఆగిపోతుందని ఆఖరు క్షణంవరకూ మహ ఆశపడింది కళ్యాణి. అతడు ఏదన్నా ఊరుపోయి ఉండొచ్చు. అకస్మాత్తుగా ఏదన్నా జబ్బుచేసి ఉండొచ్చు. లేకపోతే మొదట అతడు అడిగినప్పుడు వేషం ఇవ్వలేదుగదా అని కోపగించి, ఇప్పుడు రానన్నొచ్చు. ముఖానికి రంగు వేసుకుంటున్నప్పుడు కూడా, ఆ ఆసామీ వచ్చాడా అని అడగాలనుకుని మానేసిందామె, తీరావొచ్చాడంటే తనకి ఆశాభంగం అవుతుందని.

మూడోగంటయింది. నాటకం ప్రారంభమైంది.

పెళ్లిపీటలమీదికి కళ్యాణిని చెయ్యిపట్టుకుని తీసుకొచ్చింది రాధ.

అక్కడొక మంచిపాట రాశాడు మిస్టర్ చింతా. కళ్యాణి, రాధ అది రిహార్సిల్స్‌లో పాడినప్పుడల్లా కంటతడిపెట్టేవారు. అయితే ఆ కన్నీరు ఆనందంవల్లో, దుఃఖంవల్లో ఇద్దరికీ తెలీదు. అంతబాగుందిపాట.

సోదరీమణులిద్దరూ, ఆ పాటలో ఆ నాట్యంలో మునిగిపోయారు. పాటయిపోవొచ్చింది. కళ్యాణి పెళ్లికూతురులాగే సిగ్గుపడుతూ ఓరకంట పెళ్లికొడుకును చూడాలి. ఆమె చూసింది. నిర్ఘాంతపడి నిలబడిపోయింది. ఆ తరువాత రాధ చూసింది.

వాద్యాలు పెద్దగా పెంచేశారు మిస్టర్ చింతా, ఆడియన్సులో ఎవరికీ స్టేజిమీద జరుగుతున్న నాటకం ఏమీ అర్థంకాకుండా. ఆ గోలమధ్య రాధ. "నువ్వా!!" అంది నిప్పులు చెరుగుతూ. పట్టూ ముఖమెత్తి దీనంగా ఆమెవంక చూశాడు· అ తరువాత నాటకంలో జరగవలసిన పోర్షనుప్రకారం, లోపల్నించి ఉస్తాద్‌జీ సంపత్, "మోసం: మోసం!" అన్నపాట ఎత్తుకున్నాడు. పట్టూ లేచి నిలబడి వెనక్కుతగ్గింది, నాటకంలో తను చెయ్యవలసింది గుర్తుండికాదు, రాధ చూపులకు తట్టుకోలేక. కాని ఆడియన్సుకి మాత్రం అది అతి సహజంగా కనిపించింది. సైడ్‌కర్టన్ దగ్గరకురాగానే ఆడియన్సుకి కనబడకుండా చెయ్యిచాపి అతన్ని పట్టుకున్నాడు మిస్టర్ చింతా. ఉస్తాద్‌జీసంపత్ "మోసం!" అని తారస్థాయిలోకిపోగానే టప్పున తెరలోకి లాగేశాడు పట్టూని! ఆడియన్సు చప్పట్లుకొట్టారు కోలాహలంగా. పాటనడుస్తూనేఉంది. కళ్యాణి, రాధా ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. చప్రుని వెళ్లబోయారులోపలికి. కాని ఆ పక్క దారిలేకుండా మూయించేశాడు మిస్టర్ చింతా.

(సశేషం)

---

ఓ కవిగారిని కలుసుకుందామని ఆయన అభిమాన పాఠకుడు ఒకాయన వచ్చాడు. ఆ విషయమూ యీ విషయమూ అడిగి చివరకు "అయ్యా కవిగారూ! మీరు బట్టతలమీద ఎప్పుడైనా పద్యాలు రాశారా?" అని అడిగాడు.
ఆ కవిగారు "అబ్బే, రాయలేదండి. నేనెప్పుడూ కాగితం మీదే రాస్తుంటాను" అన్నారు టక్కున.



## దుర్జన స్వభావము

శ్లో॥ ప్రాయేణాత్ర కులాన్వితం కుకులజాః, శ్రీవల్లభం దుర్భగాః,
దాతారం కృపణాః, ఋజూనన్నృజవో, విత్తాన్వితం నిర్ధనాః,
వైరూప్యోపహతాశ్చ కాంతవపుషం, ధర్మాశ్రయం పాపినః,
నానాశాస్త్రవిచక్షణం చ పురుషం నిందంతి మూర్ఖా జనాః ॥

— నీతిశాస్త్రము.

తరచుగా ఈ లోకములో కులీనుడైనవానిని దుష్టకులజులు, భాగ్యవంతుని దౌర్భాగ్యవంతులు, దాతను లోభులు, సరళవర్తనులను కుటిలులు, ధనవంతుని నిర్ధనులు, రూపవంతుని కురూపులు ధర్మాత్ముని పాపిష్ఠులు, అనేక శాస్త్రపండితుని మూర్ఖజనులును నిందించెదరు.

## జ్ఞాతి విరోధము

శ్లో॥ సాఽసహ్యాస్మరఝుంక్రియాశ్రయగుణోన్ముక్తాత్రమబాణక్షతిం
తన్వీ సారసజాతిరిత్యవధృతా పద్మాటవీమాశ్రితా ।
సా సింధూదరసంభవాఽపి పురతః తద్బాధనే చోద్యతా
"జ్ఞాతిశ్చేదనలేన కిం" న్వితి వచః సత్యం యథా స్యాత్ తథా ॥
(సంస్కృత వసుచరిత్రము)

— మండపాక పార్వతీశ్వర శాస్త్రి.

సుకుమారి యగు ఆ గిరికాదేవి, ఓర్వజాలని ఝుంకారముతో గూడినఅల్లెత్రాటినుండి విడువబడిన మన్మథ బాణముల తాకిడికి తాళలేక, తన సారసజాతి వారేకదా యని కమలవనమును ఆశ్రయించి శరణుజొచ్చెను. ఆ కమలినిగూడా నీటిలో పుట్టినది గనుక గిరికకు సోదరి యైనను ఆమెను బాధింప జొచ్చెను. అది సరియే కదా ! ఎందుకనగా "జ్ఞాతి యుండినచో నిప్పుతో అవసరము లేదు గదా !" జ్ఞాతి అగ్నివలె దహించు ననిభావము.

## గజేంద్రుని జలక్రీడ

సీ॥ కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁ దోగి
సెలయేటినీలాద్రిచెలువుఁ దెగడు;
హస్తినీహస్తవిన్యస్తపద్మమ్ముల
వేయికన్నులవానివెఱపు॥చూపు;
కలభీ సముత్కీర్ణకల్హారరజముల
కనకాచలేంద్రంబుఘనతఁ దాల్చు;
కుంజరీపరిచితకుముదకాండంబుల
ఫణిరాజమండనప్రభ వహించు;

గీ॥ మదకరేణుముక్తమౌక్తికసూక్తుల
మెఱుగుమొగులుతోడ మేల మాడు;
ఎదురు లేని గరిమ నిభరాజమల్లంబు
వనజగేహకేళి వ్రాలునపుడు. — పోతనామాత్యుడు

గజేంద్రుడు తనకాంతలతో జలక్రీడ సలుపునపుడు తన ప్రియురాండ్రు తొండములతో తనపైన చల్లిన జలబిందువులచేత తాను, సెలయేళ్లతో గూడిన నీలమణి పర్వతమువలె ఒప్పెను. కాంతలు తనపైన వేసిన పద్మములతో తాను వేయికన్నులు గల యింద్రునివలె ప్రకాశించెను. భార్యలు తనపైన చల్లిన పచ్చని కలువ పుప్పొళ్లచేత తాను బంగరుకొండవలె భాసిల్లెను. ప్రియురాండ్రు తనపై వేసిన తెల్లకలువల కాడలచేత తాను సర్పాభరణుడైన శివునివలె ప్రకాశించెను. మదకరేణువులు తనపై చల్లిన ముత్యములచేత తాను మెరపుతీగతోగూడిన మేఘమువలె ప్రకాశించెను. ఈ విధముగ గజేంద్రుడు కమల సరస్సునందు కాంతలతో జలకేళి సలుపునపుడుసాటిలేని వైభవముతో విరాజిల్లెను.

## సూర్యాస్తమయము

చ॥ తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి లగ్గముఁ జేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితుల్. — అల్లసానిపెద్దన.

తన కాంతను (వేశ్య అందరికి స్వీయకాంతయని భావము), దారుణమైన పుష్పబాణముల దెబ్బచే వివశురాలైన దానిని మన్మథుని బారిలో పడవైచి యీ బ్రాహ్మణాధముడు (ప్రవరుడు) క్రూరుడై గర్వముతో విడిచిపోయెనని కోపముచేత భయంకరముగా నున్నాడా యనునట్లు సూర్యుడు సాయంకాలమునందు ఎఱ్ఱని కాంతితో తోచెను.

## చంద్రోదయము

చ॥ అమరులబోనపుట్టిక, సహస్రమయూఖునిజోడుకోడె, సం
తమసమువేరువిత్తు, కుముదమ్ములచక్కిలిగింత, పుంశ్చలీ
సమితికి చుక్కవాలు, నవసారసలక్ష్మితొలంగుబావ, కో
కములకు గుండెతల్లడము కైరవమిత్రుఁడు తోఁచె తూర్పునన్. — నందితిమ్మన.

దేవతలకు భోజనపాత్ర, సూర్యునికి జోడుకోడె, చీకటికి వినాశకరుడు, కలువలకు ఉత్సాహకరుడు, కులటా స్త్రీలకు విఘ్నకరుడు, కమలములను ముకుళింపజేయువాడు, చక్రవాకదంపతులకు గుండెతల్లడము గలిగించువాడును నగు చంద్రుడు తూర్పుదిక్కున కనబడెను.

## వర్షాకాల మేఘము

మ॥ వెలినల్పే యనరాదు; పాంథవనితాపీడాఘమం దైదుతూ
పులవిల్కానికి మంత్రి వౌటఁ గడు నల్పుం జెందె నీడెందమున్;
మెలఁగం జేయుదు కౌతుకం బొకటి సుమ్మీ! పాంథనిర్మూలనన్
తొలిముల్లౌనెల మ్రింగు దధ్వగలయందున్ ప్రేమ లేకుండియున్. — ఆంధ్రభిష్మణ.

ఓ మేఘమా! నీ శరీరము మాత్రమే నలుపుకాదు. విరహిణీ స్త్రీలను పీడించుట అను పాపకార్యమునందు మన్మథునకు సహాయము చేయు మంత్రివిగా నుండుటచేత ఆ పాపము సోకి నీ మనస్సుగూడ నల్లనైయున్నది. కాని, విరహిజనులయందు నీకు ప్రేమ లేకున్నను వారిని బాధించుటలో ప్రధాన కంటకముగా నున్నచంద్రుని మ్రింగి వారికి ఒక్క మేలుమాత్రము కలుగ జేయుచున్నావు.

# ధర్మచక్రం

## జరిగిన కథ

వైద్యశాస్త్ర పట్టభద్రుడైన శ్రీ నగేష్ సేవాతత్పరత కలిగిన ఆదర్శ వాది. శ్రీ నగేష్ ఆదర్శాలు ఆయన మామ అయిన శ్రీపతికి, శ్రీపతి కుటుంబం లోని వారికి హాస్యాస్పదంగా కన్పిస్తాయి. సమయానికి కట్నం అందని కారణంగా శ్రీపతి కొడుకు శ్రీహరి వివాహం, పెళ్లిపందిట్లో రభసతో వివాదంగా పరిణమించుతుంది. అంతకుముందే సైన్యంలో వైద్యాధికారిగా చేరిన శ్రీ నగేష్ అధికార బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించి తిరిగి తన వైద్యశాలకు వచ్చేస్తాడు. కారుప్రమాదంలో శ్రీపతికి మతిస్థిమితం తప్పు తుంది. ఆయన ముగ్గురు కొడుకులు, ఇద్దరు కోడళ్లు, భార్య ప్రాణాలను కోల్పో తారు. కూతురు జయశ్రీ తండ్రి శ్రీపతిని వెంట తీసుకుని శ్రీ నగేష్ హాస్పిటల్‌కు వస్తుంది. జయశ్రీ ద్వారా అన్ని వివరాలను తెలుసుకున్న శ్రీ నగేష్ శ్రీపతికి చికిత్స ప్రారంభిస్తాడు. రోజూ అతనిని వ్యాహ్యాళికి తీసుకువెళ్తూ వుంటాడు.

మధ్యాహ్నం రెండుగంటల వేళ పొలాల నుండి తిరిగి వస్తున్నాడు శ్రీ నగేష్. శీతకాలపుటెండ ఎక్కువగానే వున్నా, మేనిని సోకుతూన్న శీతల వాయువులవల్ల తీక్ష్ణత మరుగునపడి ప్రాణానికి సుఖంగానే వున్నది. నిండార విరిసిన పలురకాల పుష్ప సముదాయాలతో, చిత్ర, విచిత్ర గతులలో వయ్యారంగా నాట్యమాడుతూన్న పచ్చని పైరుచేలతో నిండు వృక్ష సముదాయాలతో నిర్మలంగావున్నది ప్రకృతి.

ఏమేమో ఆలోచనలతో నడుస్తూన్న అతడికి దూరాన ఎండలో మిల మిల లాడ్తూ కన్పించిన లేత నీలిరంగు కారు కొంత ఆశ్చర్యాన్నే కలిగించింది. 'ఎవరా'? అనుకుంటూ కొంచెం నడక వేగం హెచ్చించాడు. మరి విశేషమేమైనా ఉన్న సమయాలలో మినహా పల్లెల్లో కార్లు కనిపించాయంటే ఆశ్చర్యమే మరి! 'ఈ కుగ్రామానికి కార్లు సాధారణంగా రావు. వచ్చినా అది మునసబు ఇంటికి కావాలి, లేదా, పట్టణాలలోవున్న నా స్నేహితులెవరైనా నాకోసం వచ్చి వుండాలి' అనుకూం

### ఆరెకపూడి కౌసల్యాదేవి

టూన్న అతడు కారుకు సామీప్యంలోనికి వచ్చిన పిమ్మట కొంత ఆశ్చర్యపోయాడు. కారుబోన్నెట్‌ను ఎత్తి ఒక యువతి, ఇంజన్ దగ్గర ఏమిటో పరీక్షిస్తున్నది. అప్పటికే వాహనంచుట్టు పదెనుమండు గురు దారినపోయేవాళ్లూ, దూడల్ని కాచుకునే కుర్రాళ్లూ పోగై వింతగా తిలకిస్తున్నారు.

"ఈ యమ్మె బండి నడిపేసు కొచ్చేసిందిరా !''

"పట్టణాల్లోవాసపోలు మొగోల మాదిరిగానే పోగ్గా తిరుగుతార్రా !''

చుట్టూ చేరినవాళ్ళు ఇష్టాను సారంగా వ్యాఖ్యానిస్తున్నారు.

ఆయువతి తలెత్తి అటు యిటు యిబ్బందిగా చూడసాగింది. ఆమె మనస్థితిని గ్రహించగల్గిన నగేష్ 'పాపం, ఏదైనా అవసరం వచ్చిందేమో ? పోయి సాయపడుదునా?' అనుకున్నాడు. "అయినా నన్నడగనిదే వెళ్తే ఏమనుకుంటారో !' అనుకొంటూ ముందుకు రెండడుగులు వేశాడు.

''ఈ ఊరి పేరేమి టబ్బాయ్?'' అని ప్రశ్నించింది ఆమె చుట్టూవున్న వారిలో ఒకరిని. ఆమెను విస్మయ దృక్కులతో తిలకిస్తూన్న వారెవరికీ సమాధానం చెప్పాలని తోచలేదు. కాని వెళ్లిపోతూన్న శ్రీనగేష్‌కు ఆమె ప్రశ్నవిన్పించి వెనుదిరిగాడు. అంతలో ఆ యువతి దృష్టికూడా శ్రీనగేష్ మీదపడింది. ''నారాయణపురం ఇక్కడికెంత దూరమండీ?'' అని ప్రశ్నించింది, ఎవరో మర్యాదస్తుడైన పల్లె యువకునిగా భావించి.

''ఇదుగోనండి. యిదే. ఈ కన్పిస్తూన్న పల్లే.'' అంటూ ఎండకు ధరించినగాగుల్స్ తీసేస్తూ కారు దగ్గరకు నడిచాడు శ్రీ నగేష్.

"డాక్టరు బాబు డాక్టరు బాబు!" అంటూ వాహనం చుట్టూవున్న ప్రేక్షకులంతా కొంచం దూరంగాతొలిగి నిల్చున్నారు.

"థాంక్స్" శ్రీనగేష్‌కు కృతజ్ఞతలు తెలుపుతూ ఆయువతి కూడా తాను ధరించిన నల్ల కళ్లద్దాలు తీసేసింది. అంతలో ఆతడిని గుర్తించి నట్లు "ఓ! మీరా? నమస్కారం" అన్నది రెండు చేతులూ జోడించి. ఆనందం, సిగ్గు విచారం త్వర త్వరగా రంగులు మారిపోసాగాయి ఆమె వదనంలో.

యాంత్రికంగా ప్రతి నమస్కారంచేసి, అలాగే చూడసాగాడు శ్రీనగేష్. "మీకు నేను తెలుసాండీ?" అని ప్రశ్నించాడు.

ఆమె విషాదం ఒలికించుతూ నవ్వింది. "మీకూ నేను తెలుసు. కాని మఱచి పోయివుంటారు!"

ఆ కంఠం, ఆమాటా వినగానే మరి అలస్యంలేకుండా స్ఫురణకు వచ్చింది శ్రీనగేష్‌కు. "ఓ. మీరా! తెలుసు తెలుసు క్షమించండి. ఏమిటిలావచ్చారు?"

"శ్రీపతిగారు వారి అమ్మాయి ప్రస్తుతం ఈ ఊళ్లోవుంటున్నారట. ఒకసారి చూచిపోదామని. ఏస్నేహా బాంధవ్యాలూ లేకున్నా పరిచయస్థులను ఒక్కసారి చూడడం మానవ ధర్మంకదా!"

"పిచ్చాయన యింటికి, పిచ్చాయనను చూడ్డానికి!" చూపరులు గుసగుసలతో చెప్పుకున్నారు.

"మీరు బంధువులేగా వారికి? వాళ్లు మీకు తెలిసేవుంటుంది?" అనడిగింది శ్రీలక్ష్మి అతడిని.

"అఁ కారు" ఊళ్లోకి పోనివ్వండి. చెప్తాను, నేను నడుస్తుంటాను. అన్నట్లు కారుకేమీ ట్రబుల్ లేదుకదా?"

"లేదు. ఇంజన్ హీట్ అయితే కొంచం కూలింగ్ యిచ్చాను. అంతే. అన్నదామె బోనెట్ దింపి వేస్తూ. "రండి మీరుకూడా, కలిసి వెళ్లిపోదాం. మళ్లా మీరు నడవడం దేనికి? " ఫ్రంట్ డోర్ తీస్తూ అతడి నాహ్వానించింది.

"ఎందుకు లెండి. అంతా కలిసి ఓ అరఫర్లాంగు దూరం. మీరు తిన్నగా! మెల్లగా పోనివ్వండి."

ఆమె తిరిగి మాట్లాడలేదు. కాని 'డోర్'పై చెయ్యివేసి అలాగే అతడివేప చూస్తూ నిల్చుంది. ఆ నేత్రాలలోని అభ్యర్థనను మరి తృణీకరించలేక పోయాడు శ్రీనగేష్. కన్పించీకన్పించని చిరునవ్వుతో "సరే. పదండి." అంటూ వచ్చి సీటులో కూర్చుని తలుపు వేసుకున్నాడు. ఆమె తృప్తిగా నిట్టూర్చి, స్టీరింగు చేతబట్టింది.

"బలే; బలే!" కారు స్టార్టుకాగానే పిల్లలంతా సంతోషంతో చప్పట్లు కొట్టారు.

"పల్లెజనం!" అన్నాడు శ్రీనగేష్ మరివ్యాఖ్యానం అవసరం లేకుండా, గ్రహించినట్లూ! అటువంటి సంఘటనలను సరకు జేయనట్లూ నిర్లక్ష్యంగా నవ్వి ఊరుకున్నదా యువతి, రోడ్డుపైననే దృష్టినిగిడ్చి.

మందస్వరంతో అన్నాడు శ్రీనగేష్: "ఆరోజు మిమ్మల్ని కేవలం పెళ్లికూతురి వేషంతోనే చూచాను. అంచేత చూడగానే యివ్వాళ గుర్తుపట్టలేక పోయాను. శ్రీలక్ష్మి కదండీ మీపేరు?"

"అవును." ఎక్కడో దూర తీరాల నుండి గాలిలో తేలుతూ వినవచ్చిన కోకిల స్వరంలాగా పలికింది ఆ కంఠం.

"ప్రస్తుతం శ్రీపతి గారికి నేనేవైద్యం చేస్తున్నాను." అన్నాడు శ్రీనగేష్.

శ్రీలక్ష్మి వదనం విషాద మేఘాచ్ఛాదిత మైంది. నీరస గ్రాతంతో అన్నదె: "ఏమిటీ, వారి కుటుంబానికి సంభవించిన దారుణమైన ఆపదను తలచుకున్న కొలదీ మనస్సు ఏమిటోగా అయిపోతుంది. ఆ వివాహం చెడిపోకుండా, వాళ్లందరూ ఆ రోజున అలాగ వెళ్లిపోకుంటే మరో విధంగా జరుగునేమో అంటారు కొందరు. ఒక్కొక్కప్పుడు నాకుకూడా ఆవాదన నిజమే నేమో నన్పించి, మనస్సు అవ్యక్తమైన బాధకు లోనౌతుంటుంది."

"మానవుడి మెదడుకు రకరకాల ఆలోచనలలో కొట్టుకుపోవడం సరదా. వివేకవంతులు అవన్నీ పట్టించుకోకూడదు. అందునా మీరు మెడికల్ స్టూడెంటు కూడ! ఉడ్ బి డాక్టర్! ఆలోచనలు మరో విధంగా సాగాలి!" అంటూ నవ్వేశాడు.

శ్రీ లక్ష్మికూడా నవ్వేసింది.

"అన్నట్టు మీ అమ్మగారూ నాన్నగారూ అంతా కులాసానా ?" ప్రసంగ ధోరణి మార్చేశాడు, శ్రీనగేష్.

"అఁ. నిన్న అమ్మగారు, కే.జి. హెచ్‌లో ఓ బంధువును చూడబోతేనే ఈ విషయం-అంటే శ్రీపతిగారు యిక్కడ వున్నవైనం తెలిసింది. అప్పటినుండీ నా మానినగాయం మళ్లీ రేగినట్లైంది. ఓ సారి చూచి, జయకు కండొలెన్సెస్ చెప్పడం, అవసరమైతే క్షమాపణలు కోరడం నా కర్తవ్యంగా భావించాను! "

భాషకందని ఆశ్చర్యభావం దోబూచులాడింది శ్రీనగేష్ వదనంలో.

"ఏం అలాచూస్తారు? 'ఇదెక్కడి సిగ్గుమాలిన ఘటం' అనుకుంటున్నారా? వారికీ మాకూ మధ్య జరిగిన విషయం మరువలేనంత దారుణమైనదే అయినా మానవ ధర్మాలు మరికొన్ని వుంటాయి కదా? ఆపద సమయంలో శత్రువునైనా అవమానించ రాదంటారు."

"మీవంటి సున్నితమైన మనుస్సు, మంచి హృదయం ఈ కాలంలో ఎందరికుంటా యంటారు? " మనస్ఫూర్తిగా అన్నాడు శ్రీనగేష్. అంతలో కారు ఊరిలో ప్రవేశించింది.

"అలా కుడిచేతి ప్రక్కకు త్రిప్పండి అదుగో ఆ కన్పించే పచ్చరంగు మేడే. ఆగేటు ముందు ఆపండి." అతడు చెప్పిన దారినే కారు నడచి, గమ్యస్థానం జేరింది, అలవాటు ప్రకారం, హోల్టు యిచ్చేముందు హారన్ కొట్టి.

శ్రీలక్ష్మి శ్రీనగేష్ లిరువురూ మేడ మీదికి వెళ్తూనే కొయ్యబారిపోయారు.

కను గ్రుడ్లను పెదవిచేసి అటు యిటు భయంకరంగా విపరీతంగా కదలించివేస్తూ ఆపాదమస్తకం గడగడ వణకుతూ గదిలో

**అటు**యిటు పరుగు లెడుతున్నాడు శ్రీపతి, చెవులు చేతులతో మూసుకుని, ''బాబోయ్! కారు! రైలు!! విమానం!!! నాకొడుకులు! నాభార్య!'' అని భయంకరమైన పిచ్చికేకలు వేస్తున్నాడు. కుమార్తె, నౌఖర్లు అతడిని పట్టుకో లేక సతమతమైపోతున్నారు.

''రావుగారూ!'' గర్జించాడు శ్రీనగేష్, గది దద్దరిల్లేట్టు. ఆ గర్జనను విని శ్రీపతితో సైతం అందరూ ఉలిక్కి పడ్డారు.

''ఏమిటది రావుగారూ? ఏమిటా హడావుడి?''

''బాబోయ్! కారు! కారు! ...... నా కొడుకు!......'' పాత సాతమే వల్లించుతూ విపరీతంగా చిందులు వేస్తున్నాడు శ్రీపతి.

''ఊఁ. ఊఁ!! వూకొడుతూనే నలుగురికి లొంగకున్న అతడిని, తానొక్కడూ అవలీలగా అదిమి పట్టుకున్నాడు నగేష్ కదలనీయకుండా.

''త్వరగా మాయింటికి వెళ్లి నా మందుల బాగ్ తీస్కురా!'' అంటూ ఒక నౌఖర్నీ, ''కాసిని చల్లటి మంచి నీళ్లు''. అంటూ మరో పాలేరునూ తరిమాడు, ''నువ్వు వెళ్లికూర్చో!'' అన్నాడు జయశ్రీని. అతడి స్వరంలోని తీక్షణతను గమనించిన జయ మారు మాట్లాడ కుండా ఒక చోట కూర్చుంది, కళ్లొత్తుకుంటూ, ఆయాసపడుతూ.

పది నిముషాలలో మందుల సంచితో పరుగెత్తుకు వచ్చాడు నౌఖరు.

శ్రీనగేష్, మంచి నీరైతే శ్రీపతి చేత ఒక్క చుక్కకూడా త్రాగించ లేక పోయాడు కాని, బలవంతంగా నలుగురి చేత అతడిని పట్టి కదలకుండా శయనింప జేశాడు.

''బాబ్బాబు. నీకు దండంపెడతాను, నాపిల్లలూ, భార్య కార్లోనే మాయమై పోయారు, ఏదో కారొచ్చింది. వాళ్లొచ్చినట్లున్నారు. తీసుకురా. నాకళ్లపడేయి నీకు పుణ్యంముంటుంది'' రెండు చేతులూ జోడించి నమస్కరించి శ్రీనగేష్ ను దీనంగా అభ్యర్థిస్తూ, నిస్సహాయంగా విలపించుతూన్న శ్రీపతిని చూస్తున్న అందరికే కాదు—అనేకంచూచి వున్న, గుండె నిబ్బరం కల నగేష్‌కు కూడా కంట నీరు తిరిగింది.

''వస్తారు, మీరు కుదురుగా వుండండి. ఒక్క క్షణం కదలకుండా పడుకోండి.'' అంటూనే నెమ్మదిగా యింజక్షన్ చేసేశాడు శ్రీనగేష్.

అంతే! అయిదు నిముషాలు గడిచేసరికి కుదురుగా పడుకుని మత్తుగా నిద్ర పోసాగాడు శ్రీపతి.

అందరూ ఒక్క సారిగా తేలిక పడ్డట్టు నిట్టూర్చారు.

చేతులు కడుక్కుంటూ జయశ్రీవైపు చూచాడు శ్రీనగేష్.

జయశ్రీ అతడి చూపుల్లో భావం గ్రహించింది ''క్రింద, వీధిలో ఏదో కారు హారన్ విన్పించింది. అంతే చక్కగా మాట్లాడ్తూ మాట్లాడుతూన్న నాన్న అలా మొదలు పెట్టేశారు. ...'' మంద స్వరంలో చెప్తూ చెప్తూన్న జయశ్రీ నేత్రాలు అప్రయత్నంగా ద్వారంవైపు ప్రసరించడం, అచ్చట శిన్నురాలై నిలబడివున్న శ్రీలక్ష్మి కన్పించడం జరిగింది. వెంటనే మాటలు ఆపుజేసి, తీక్ష్ణమైన దృష్టులతో ఆగ్రహంగా లేచి నిల్చుంది. అమాంతంగా అలా మారిపోయిన ఆమె అవతారాన్ని చూచి ఎవరి మట్టుకు వారే అచ్చెరువుతో తిలకించ సాగారు.

''ఎందుకే రాక్షసీ ఇక్కడ కూడా దాపురించావ్?'' ఒక్కో మాటే కటువుగా ఉచ్చరిస్తూ ఆమె దగ్గఱగా నడచింది జయశ్రీ.

''జయా!!'' అంత కంటె మాట్లాడ లేక పోయింది శ్రీలక్ష్మి.

''ఎప్పుడైతే నిన్ను మా అన్నయ్యకు చేసుకుందా మనుకున్నామో, ఆ నాడే ఆమరు క్షణంలోనే గ్రమింగే శావు అందర్నీ. మిగిలిన వాళ్లకు పిచ్చెక్కించావు. నువ్వు మనిషివనుకుని భ్రమించాం కాని, నువ్వు శని దేవతవు, మృత్యుముఖానివి!'' జయ కంఠం అంత కంత కూ తారస్థాయి నందుకుంటూన్నది. ''నీ పాడు సంబంధమే లేకుంటే, అది అలా వెడిసి కొట్టకపోతే, మేము ఆరోజున ఆదిక్కుమాలిన ప్రయాణం చేయవలసిన అవసరమే వుండేది కాదు!''

''జయా?'' మధ్యన నగేష్ నచ్చచెప్పయత్నించాడు; ''ఇంటి కొచ్చిన అతిథిని అలాగేనా అవమానించడం?''

''ఉండుబావా. నువ్వేమీ చెప్పవద్దు. నా బాధనీకర్థంకాదు. ఈమెను చూస్తుంటే నా మేను ఉడికి పోతూన్నది; నా మనస్సు రగులుకు పోతున్నది; నా బాధ అధికమైపోతోంది. ఛీ ఛీ ఛీ ఈ నషజాతకి అతిథిగావచ్చిందా, అపహసింప వచ్చిన పిశాచిగాని?''

''సరే, నీయిష్టం. నేనువెళ్తున్నాను. [illegible] కువ రావచ్చు. మళ్లీ ఏమైనా హంగామాచేస్తే కబురు పెట్టు.'' అంటూనే నిష్క్రమించాడు నగేష్ అక్కడినుండి.

అందుకు జయ ఏమీ సమాధానం చెప్పలేదు, కాని. తిరిగి శ్రీలక్ష్మిదెస చూస్తూ, ''ఇంకా నిల్చున్నావేం? గెటౌట్, లేకుంటే మెడ బట్టి గెంటిస్తాను.'' అని అరచింది.

ఆ అండ చూచుకొని నౌఖర్ల నోళ్లు లేచాయి, ''నడవమ్మా నడు, ఇక్కడ మీకెవరున్నారు గనుక?''

విస్మయాన్నీ, విషాదాన్నీ తాత్కాలికంగా వెనుకకు నెట్టి, హేళనగా ఒక నవ్వు నవ్వింది శ్రీలక్ష్మి. ''మర్యాదగా మాట్లాడడం నేర్చుకో జయా. కోరిన బంధుత్వం విధి ప్రభావంవల్ల వికటించినా, స్నేహాన్ని నిలుపుకుందామనే ఉద్దేశ్యంతోనూ, మానవత్వం సహజమైన సానుభూతితోనూ వచ్చాను కాని, మీనుండి ఏమీ ఆశించిరాలేదు. లోగడ నాతో బంధుత్వాన్నికోరి చెడగొట్టుకున్నట్టే, ఇప్పుడు నే నందివ్వబోయే స్నేహానికి కూడా నీ అంతటనీవే అనర్హురాలిగా నిరూపించుకొంటే, ఆదోషం నాది కాదు! వెళ్తున్నాను కాని జయా, ఒక్కటి మాత్రం అనకుండా వుండలేను!

నువ్వు ఆవేశంలో అన్నావో - అవివేకంగా అరిచావో నా కనవసరం, కాని నేను విని మౌనం వహించలేని-జన్మజన్మలకూ మఱచిపోలేని మాటలన్నావు నన్ను. నాతో వివాహం నిశ్చయమై, నా దురదృష్టం వల్ల నీ అన్న చచ్చాడని నువ్వను కొంటే, ఇంత అల్పాయుష్కుడిని వివాహమాడి జన్మంతా దుఃఖించవలసిన దురదృష్టం నాకు లేని మహా అదృష్టవంతురాలని నేననుకొంటున్నాను. మనుష్యులనుండి యింకా యింకా డబ్బు పిండికూడబెట్టుంటే, ఆ కూడ బెట్టినది తినడానికే అదృష్టంలేకుండా పోయారు. అదే చేతులారా చేసుకున్న అనర్థం, గుడ్ బై .''

అందరిసమక్షంలో అంత పౌరుషంగా మాట్లాడిందే కాని, మేడదిగి కారు చేరే సరికి శ్రీలక్ష్మి సగ్రహమంతా చదిరిపోయి, అంతర్గతావేదన కన్నీటి రూపంలో బహిర్గతమైంది. జలజలా రాలి పోతూన్న అశ్రువులను ఒత్తుకోవాలనే గుర్తింపుకూడా లేకుండా కారు తలుపుపై చేయివేసి పరధ్యానంగా నిల్చున్న ఆమెను ఇరుగు పొరుగు అంతా వింతగా చూడసాగారు.

"ఏమిటా అధైర్యం లక్ష్మిగారూ? ''

ఆ మాటలకు ఉలికి పాటుతో చూచిన ఆమెకు, కారుకు అటు ప్రక్కగా నిల్చున్న శ్రీ నగేష్ కన్పించాడు.

''రండి. మాయింటికి వెళ్దాం. రోడ్డు మీద ఏమిటిలా ప్రవర్తిస్తున్నారు? ''

''థాంక్స్, వద్దులెండి, సెలవు, మీ మంచి తనాన్ని మఱచి పోలేను.'' అని కళ్లు ఒత్తుకుని కారులో కూర్చున్నదామె.

''అలాగనకండి, ఆహ్వానాన్ని అంగీకరించడంకూడ మర్యాదస్తుల లక్షణం.'' అంటూనే తానూ కారెక్కి కూర్చున్నాడు శ్రీ నగేష్. ''నేనూ ఎక్కేశాను మరి. మాయింటికే పోనిస్తారో, మీ ఊరికే తీసుకు పోతారో మీయిష్టం, నేను మాత్రం దిగను.'' అన్నాడు నవ్వుతూ.

శ్రీలక్ష్మి కూడా నవ్వేసింది. ''మీరంత ఆదరంగా ఆహ్వానిస్తే ఎందుకు రాను? ''

కారు శ్రీ నగేష్ యింటి ముందు ఆగేవఱకూ మళ్లీ ఎవరూ మాట్లాడలేదు. ఒక నౌకరు పరుగు పరుగున వచ్చి, కారు తలుపు తీసి చేతులు కట్టుకు నిల్చున్నాడు.

శ్రీ నగేష్ దిగి, ''దిగండి లక్ష్మి గారూ.'' అన్నాడు. కారులాక్ చేసి దిగివచ్చింది లక్ష్మి.

ఆ గృహాన్ని విస్మయంతో చూస్తూ నిల్చున్న శ్రీ లక్ష్మిని నవ్వుతూ ప్రశ్నించాడు శ్రీ నగేష్. ''ఏమండి, అలా చూస్తారు? మాయిల్లు బాగుండలేదా ? ''

ఆమె మధురంగా నవ్వింది. ''పల్లెలో వారికికూడా యింతమంచి యిండ్లు వుంటాయా అని: '' అంది.

''యేమో ! ఏం, మీ పట్నవాసం వాళ్లకేవుండాలా మంచి అంతా ? ''

ఇద్దరూ నవ్వుకున్నారు.

' అయ్యగారి యెంట ఈ అమ్మాయిగా రొచ్చేరేటి ! ' అని విస్తుపోతూ చూస్తూ నిల్చున్న నౌకరు ఆంతర్యం గ్రహించిన శ్రీ నగేష్ లోలోన చిన్నగానవ్వుకుంటూ. ''ఒరేయ్. బంధువు లొచ్చారని అమ్మగారితో చెప్పు లోపలికి పోయి.'' అని ఆజ్ఞాపించాడు.

''చిత్తం, చిత్తం.'' వాడు లోనికి ఒక్కపరుగు తీశాడు.

''రండి లోపలికి.'' అన్నాడు లక్ష్మి వైపు తిరిగి శ్రీ నగేష్.

''ఆఁ. నడవండి.'' అతడి ననుసరించింది ఆమె. వార్త విన్న శ్రీదేవి వారికి ఎదురుగా వచ్చింది.

''మా అమ్మగారు.'' అన్నాడు శ్రీలక్ష్మితో శ్రీనగేష్.

''నమస్కారమండీ.'' అంది శ్రీలక్ష్మి, శిరస్సు కొద్దిగా వంచి, నమ్రతగా చేతులు జోడించి.

శ్రీలక్ష్మి అపురూప సౌందర్యానికీ, వినయ విధేయతలకూ ముగ్ధురాలై పోయిన శ్రీదేవి, ఆమెదగ్గఱగా వచ్చి చేయిపట్టుకుని ''దామ్మా, కూర్చో.'' అంటూ తన ప్రక్కనే సోఫాలో కూర్చోబెట్టుకున్నది. ఎదుటి సోఫాలో చిరునవ్వు లొలికిస్తూ కూర్చునాడు శ్రీనగేష్.

శ్రీదేవిని చూస్తూ శ్రీలక్ష్మి అత్యంత విస్మయం జెందింది. శ్రీనగేష్ తల్లి గారంటే ఎవరో ముసలామె అను కున్నది. కాని ఠీవిగా ఒక మహా సామ్రాజ్ఞిలాగా వున్నది శ్రీదేవి.

ఒక్క బొట్టుమినహాగా పూర్తి నిండు అలంకరణలోనే వున్నది శ్రీదేవి. తెల్లని పట్టు చీర, పట్టు జాకెట్టు, మెడలో పెద్ద బంగారు గొలుసూ, చేతులకు నిండుగా బంగారు గాజులూ, చెవులకు రవ్వల దుద్దులూ, సాధారణంగా దువ్వి సిగ చుట్టుకున్న పెద్ద వంకుల జుత్తూ, బంగారు వన్నె శరీర ఛాయా, నిండు విగ్రహమూ, చక్కగా హుందాగా చక్రవర్తిని లాగా మాట్లాడుతూన్న ఆతీరూ—చూపరులను ముగ్ధులను చేసి వారికి ఎనలేని భక్తి గౌరవ భావాలను కలిగిస్తాయి.

'కుమారునికి తగిన తల్లి—తల్లికి తగిన కుమారుడు!' అన్పించింది శ్రీలక్ష్మికి.

''నీ పేరేమిటమ్మా ? '' శ్రీదేవి ప్రశ్నించింది.

''శ్రీలక్ష్మి అండి.''

''చక్కటిపేరు ! ఏ వూరు మీది ? ''

''ప్రస్తుతం వైజాగ్‌లో వుంటున్నామండి. ''

''ఓహో! అయితే, ఈవూరు......'' అంటూ అర్థోక్తిలో ఆపేసింది శ్రీదేవి.

ఆమె భావాన్ని గ్రహించిన శ్రీలక్ష్మి, సమాధానం ఏంచెప్పాలో తెలియక తికమకపడుతూ, భూమివైపు చూస్తూ కూర్చుంది. ఆమె వదనంలోని కాంతి, పెదవులపై నర్తిస్తూన్న చిరుహాసమూ అదృశ్యమయ్యాయి.

శ్రీనగేష్‌కు మెరుపులాంటి ఆలోచన తట్టింది. "ఆమె మెడిసన్ నాలుగో సంవత్సరం చదువుతున్నారమ్మా. ఇంకొక్క ఏడాది గడిస్తే డాక్టరై పోతారు. నాహాస్పిటల్ చూద్దామని వచ్చారట ! ''

తృప్తిగా ఊపిరి వదలి, శ్రీనగేష్ దెస కృతజ్ఞతతో చూసింది శ్రీలక్ష్మి.



శ్రీదేవి అన్నది! "చాలా సంతోషమమ్మా. మంచి మనుషులనూ మంచి పనులనూ మంచివారే అర్థం చేసుకోగలరట. నువ్వుకూడా మా అబ్బాయి వంటిదానవే ననుకుంటాను. పైపైకి అభినందించినా, పల్లెలో యింత అసుపత్రిఏమిటని అందరూ హేళన చేసేవారే. నిజంగా మెచ్చుకునే వారిని వ్రేళ్లపై లెక్కపెట్టవచ్చు."

విషయమేమిటో పూర్తిగా తెలియని శ్రీలక్ష్మి వింటూ మౌనం వహించింది.

"అన్నట్టు......" హఠాత్తుగా ఏదో గుర్తువచ్చినట్టు చిరునగవుతో అన్నది శ్రీదేవి, "అమ్మాయిని చూస్తూనేను మర్యాదల సంగతే మఱచిపోయాను, లేమ్మా, భోజనంచేద్దువుగాని. ఎప్పుడనగా బయలుదేరావో యేమో! అసుపత్రి తర్వాత చూడవచ్చు."

"నేను భోజనంచేసే బయలుదేరానండి, మరి నాకు అనుమతిస్తే, వెళ్లడానికి ..."

"అయ్యో, అదేమిటి? అప్పుడే?"

"ఆవిడ మాటలకేంలే అమ్మా, ఇప్పుడప్పుడే వెళ్ళనిస్తామా?" అన్నాడు శ్రీనగేష్ నవ్వుతూ, "పోనీ, భోజనం చేయకుంటే కాస్త కాఫీ ఫలహారాలైనా........." అంటూండగానే నౌఖరు ప్రవేశించాడు, ఆ రెండు వస్తువులతో.

"ఓ ! బాగా సుశిక్షితులైన నౌఖర్లూ, సుందరమైన గృహమూ,......" అంటూ నవ్వేసింది శ్రీలక్ష్మి.

ఈసారి శ్రీదేవి కూడా శ్రీలక్ష్మి శ్రీనగేష్‌లతో బాటు నవ్వు లొలికించింది. "ఏమోనమ్మా. ఏదో ముసలిదాన్ని, పాత కాలపుదాన్ని. నా తీర్పుదిద్దుళ్ళలో ఈ యింటికి పూర్తి అందం ఎలా వస్తుంది? ఇల్లాలు రావాలి, ఇంటికి కళ రావాలి."

శ్రీలక్ష్మి ముసిముసిగా నవ్వుతూ గది నలుదెసలా కలియచూస్తూ కూర్చుంది, కాఫీ తీసుకుంటూ.

"మీ నాన్నగారి పేరేమిటమ్మా?"

"శ్రీనివాసరావుగారండి. జిల్లా జడ్జిగా చేసి రిటైరయ్యారు."

"మీరు ఈ ఎం.బి.,బి.యస్. పూర్తిచేసి ప్రాక్టీస్ పెడ్తారా. ఇంకా పైకి చదువుతారా?" శ్రీనగేష్ ప్రశ్నించాడు.

"బహుశః ప్రాక్టీసే పెడతానండి. ఇంక పై చదువు ప్రశ్నే లేదు. ఇక్కడికి ఈ చదువు రావడమే నాకు పెద్ద అదృష్టం. ఇంకా చదువుకోవలసిన చిన్న చెల్లెలూ, తమ్ముడూ వున్నారు."

"అయితే నీ చదువు చిన్నదంటావా? అదీ చాలా పెద్ద విద్యేకదమ్మా? డాక్టరంటే మాటలా?" అన్నది శ్రీదేవి.

"అవుననుకోండి. కాని ఇంతకంటె పెద్ద చదువులు చదువుతున్న వారనేకమంది వున్నారండి ఈ రోజులలో, నా చదువు ఏమంత మహాగొప్పదని అనుకోను. అందరూ సాధారణంగా, ఉన్న ఊళ్ళో బడికి పంపి మామూలు చదువులు ఎలా యధాలాపంగా చెప్పిస్తారో—అలాగే నన్నూ నాన్నగారు ఉద్యోగ రీత్యా అనేక ఊళ్ళు తిరుగుతూ సరదాగా అక్కడ స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ జేర్పించారు. దైవకృప వల్ల నాకూ కాస్త చదువు అబ్బింది. అంతేనండి."

ఆ మాటలకు ముగ్ధురాలై పోయింది శ్రీదేవి. "అంత అణకువా, నమ్రతా వుండడం అన్నివిధాలా మంచిదమ్మా. నాకు నచ్చావు. నీవంటి అమ్మాయి—సాక్షాత్తూ లక్ష్మీదేవిలాగా యిలా మా యింటికిరావడం, పరిచయం కలగడం, చాలా సంతోషంగా వుంది నాకు, ఇవాళ చాలా మంచి రోజు."

అంత పెద్దామె తనను ప్రశంసిస్తూంటే శ్రీలక్ష్మి వదనం సిగ్గుతో భూమిలోకి కృంగిపోయింది.

"రండి. హస్పిటల్ చూద్దాం". శ్రీనగేష్ లేచి దారి తీశాడు.

సూర్యరశ్మిలో చక్కగా మెరుస్తూ తళతళలాడుతూన్న వెండి రంగు అక్షరాలను చూస్తూ కొలది క్షణాలు చకితురాలై నిలచింది శ్రీలక్ష్మి. "భాగ్యచక్రం!" చాలా క్రొత్త పేరే?" అన్నది.

శ్రీనగేష్ సమాధానమివ్వకుండా చిరునవ్వులు చిందించి ఊరుకున్నాడు. ఆసుపత్రి అంతటా జనం కిటకిటలాడుతున్నారు. నర్సులు, కంపౌండర్లు అటుయిటు హడావుడిగా తిరుగుతున్నారు మందులతో, చేతిలో కాగితాలతో. అంతా తిరిగి చూడడానికి అరగంట పట్టింది ఇద్దరికీ.

ఇద్దరూ తిరిగి వచ్చి కన్సల్టింగ్ రూమ్‌లో కూర్చున్నారు. ఆనందాశ్చర్యాలతో అన్నది శ్రీలక్ష్మి. "పల్లెటూరి ఆసుపత్రి అంటే 'ఏదోవుంటుందిలె' మ్మనుకున్నాను కాని, ఇలా వుంటుందని ఊహించలేదు. మహానగరాలలోని మిషనరీ హాస్పిటల్స్‌ను కూడా తలదన్నేటు ఉన్నది. మెంటల్ పేషెంట్సు, మెటర్నిటీ సెక్షన్, ఆపరేషన్ థియేటర్—అబ్బ! అన్నీవున్నాయి. మీ ప్రయత్నం మెచ్చుకో తగ్గది, ఒక లేడీ డాక్టరు కూడా వుంటె ....................పల్లె జనులకు మరేలోటూ వుండదు.

"నిజమే. కాని ఇది పల్లె కావడంతో కొన్ని సమస్యలు తలలెత్తుతాయి! లేడీ డాక్టర్‌ను తమ ఆసుపత్రులలో ఉద్యోగాలకు పెట్టుకున్న అనేక మందిని నే నెరుగుదును. వాళ్ళకేదో గొడవ వచ్చి విడిపోవడం, ఆపైన ప్రజ తమ ఊహ కందినట్టూ నోటికొచ్చినట్టూ రకరకాల కథలు ప్రచారంచేయడం జరుగుతుంది. అవి నిజం కాకున్నా సరే నలుగురూ నమ్ముతారు, డాక్టర్ల విలువ తగ్గుతుంది. అది ఆసుపత్రికీ, డాక్టర్లకూ కూడా క్షేమకరం కాదు. ముఖ్యంగా, డాక్టర్ విషయం అటుంచండి. లేడీ డాక్టర్ మనస్సు సున్నితమైతే మరి బాధ. పర్యవసానాలు ఘోరంగా పరిణమించవచ్చు. ఏ చెట్టు నీడను శయనించారో ఆ చెట్టు కొమ్మలనే నరికి ఇల్లు కట్టుకునే తత్వం మానవులది. ఇవాళ ప్రాణదానం చేసిన డాక్టర్ల పైననే రేపు చాటున నోటికొచ్చిన ప్రచారాలు చేసి వినోదిస్తారు. వాళ్ళ కాలక్షేపాలు మనకు ప్రాణ సంకటాలుగా తయారౌతాయి. ఎవరైనా కృత్తివారైన వైద్యురాలుంటే, ఆవిడ ఈ పల్లె పట్టున వుండడానికి అంగీకరిస్తే ఉద్యోగంలో నియమించాలనే ప్రయత్నంలో వున్నాను."

"కాని......కాని........." ఏదో చెప్పబోయి చెప్పలేక పోయింది శ్రీలక్ష్మి.

"ఏమిటి చెప్పండి."

"మీ భాగస్వామియైన లేడీ డాక్టరైతే...". కొద్ది సేపు తటపటాయించినా కడకు చెప్పేసింది శ్రీలక్ష్మి.

శ్రీ నగేష్ నవ్వులో లోకంలోని విషాదమంతా వర్షించింది. "ఒకప్పుడు అదే అభిప్రాయంలో వుండేవాడిని, కాని ఇక యిప్పుడు అటువంటి అవకాశమేమీలేదు." బాధ ప్రస్ఫుటమైంది కంఠంలో.

ఎందుకో శ్రీలక్ష్మి వదనం చిన్నబోయింది.

అంతలో హాస్పిటల్ సిస్టర్ ప్రవేశించింది. "నంబర్ సెవెన్, ట్వెంటీవన్ రూములలో పేషెంట్సు యివాళ డిస్చార్జి అయి వెళ్ళిపోతున్నారు సార్." అన్నది శ్రీ నగేష్‌తో.

"గుడ్. రమ్మను."

వెంటనే ఆ వ్యక్తులను లోనికి ప్రవేశపెట్టింది సిస్టర్.

దండాలు పెడుతూ ప్రవేశించారా రోగులిద్దరూ.

"నా చర్మం చెప్పులు కుట్టియిచ్చినా మీ ఋణం తీరదు దొరా. మీ పున్నెంవల్ల నేను బ్రతికాను. మా తండ్రి తాతలు యిదే జబ్బుతో, ఈ పల్లెలో అతీ గతీలేక సచ్చి పోనారట." ఆనంద పారవశ్యంతో డాక్టర్‌కు మరీ మరీ నమస్కరించి, కొంత డబ్బు బల్లపై వుంచి వెళ్లిపోయాడా వ్యక్తి. అది లెఖ్ఖకూడా చూచుకోకుండా డ్రాయర్‌లో పడేశాడు శ్రీ నగేష్.

రెండవ వ్యక్తి ఒక స్త్రీ. అమాంతం వచ్చి డాక్టర్ పాదాలను పట్టి కన్నీరు కురిపించింది. "డాక్టర్ బాబూ. మీరు, మీ పెద్దలూ కలకాలం సల్లగుండాల. ఇంతదాక ఆరుగురు బిడ్డల్ని ఆ దేవుడిచ్చినా పురుట్లోనే పోగొట్టుకున్నాను. పెంచుకొనే అదృష్టం లేకపోయింది. ఈ బిడ్డ మీ సలవ వల్ల దక్కాడు. మీరే మా పాలిటి దేవుళ్లయ్యారు బాబూ. రోజూ దీపం పెట్టి మొక్కుతా. చచ్చి మీ కడుపున పుడతా. అంతకంటె నేను ఏమీ యిచ్చుకోలేను బాబూ. కూటికేలేని పేదదాన్ని. కడుపు తీపితో వచ్చి వైద్యం మాత్రం సేయించుకున్నా." డాక్టర్ ఏమంటాడోననే భయ సంశయాలు కన్పించాయామె నేత్రాలలో.

నిర్మలంగా చిరునవ్వునవ్వాడు. నగేష్. "ఫర్వాలేదమ్మా. బాధపడకు. వెళ్లిరా. వారం వారం బిడ్డను తీసుకొచ్చి చూపించి వెళ్తూండు. అవసరమైన మందులు యిస్తూంటాను."

ఆమె కళ్లు అమితానందంతో మెరిశాయి. మీరు నిజంగా దేవుళ్లే బాబూ, మీ బాగ్గాన్ని ఇలా మాకోశం, మా పేదోళ్లకి పాణాలు నిలపడం కోసం కర్సు బెడతన్నారు. ఆ భగమంతుడు మిమ్మల్ని సల్లంగ సూడాలి. ఇంకాతరగని భాగ్గెమివ్వాలి. మీ అమ్మకడుపు సల్లగుండాలి." తృప్తితో అటుయిటూ ఏడు తరాల వారిని మనసారా దీవిస్తూ వెళ్లిపోయిందా స్త్రీ.

ఏదో అనిర్వచనీయమైన సంతోషసంతృప్తులు వెల్లివిరిశాయి శ్రీ నగేష్‌వదనంలో.

అంతా విస్ఫారిత నయనాల్తో వీక్షిస్తున్న శ్రీలక్ష్మి మానస వీణ ఆక్షణంలో మధురభావాలు మీటుతూ అతని మహనీయాదర్శాలను గానం చేసింది. ఆహ్లాద మనస్కతతో ప్రకాశంగా అన్నది. "అర్థమైంది మీ ఆసుపత్రికి ఇంత మహత్తరమైన నామకరణం ఎందుకు చేశారో! ఈ పల్లె జనులకు ఆరోగ్య భాగ్యాన్ని ప్రసాదించే ఈ నిలయానికి మీరు చక్రవర్తులన్న మాట! చాలా ధన్యులు మీరు!"

శ్రీ నాగేష్ ఒక్కసారి గంభీరంగా ఆమె దెస చూచి ఊరుకున్నాడు.

"అయితే, ఇంతకూ యిలా ఈ పల్లెలో వుండి సేవ చేయాలనే అభిలాష మీ కెందుకు కలిగింది? ఎలా కలిగింది?"

"నా చిన్ననాటి అనుభవాలు."

"అంటే?"

"మీరు ఓపికగా వినగలిగితే చెప్తాను."

"చెప్పండి, మీ చేత యింతటి మహత్కార్యం చేయించిన ఆ కారణా లేమిటో వినగలగడం కూడా ఒక అదృష్టమే!

గతాన్ని స్మరించుకుంటూ అరనిమీలిత నేత్రుడై చెప్పసాగాడు శ్రీ నగేశ్. "నా చిన్నతనమంతా ఈ పల్లెలోనే తాత గారింట గడిచింది. సరైన వైద్య సదుపాయాల్లేక అల్లాడే పల్లె ప్రజల దుస్థితిని చూచి ఆతెలిసీ తెలియని వయస్సులోనే నా మనస్సు ఆవేదనతో ఆక్రోశించేది. నన్ను అధికంగా చలింప జేసిన ఆనాటి కొన్ని సంఘటనలు వివరిస్తాను. వినండి............

వింటూన్న శ్రీలక్ష్మికి కనులకు కట్టినట్టు కన్పించ సాగాయి—— (సశేషం)

# గిరిజనోద్ధరణకై కాఫీ తోటల పథకం

**టి. రాజగోపాలన్**

కాఫీ చరిత్ర భారతీయులకు 17వ శతాబ్దం నాటికే తెలుసు. బాబూద్దీన్ అను ముస్లిమ్ యాత్రికుడు మొదట కొన్ని కాఫీ గింజలను మక్కా నుండి తెచ్చి, సంపదకు చిహ్నంగా వాటిని తన ముందు తరానికి అందించాడనీ చెప్తారు.

భారతదేశంలో కాఫీ దాదాపు మూడు లక్షల ఎకరాల భూమిలో ముఖ్యంగా మైసూరు, కేరళ రాష్ట్రాలలో సాగు చేయబడు చున్నది. 1960వ సంవత్సరంలో ఆంధ్ర ప్రదేశ్ "ఇండియా కాఫీ ఫామిలీ" లో సభ్యత్వం సంపాదించుకున్నది. గోదావరి, కృష్ణా తీరాల్లోని తూర్పు కనుమల కొండల ప్రాంతం మన రాష్ట్రంలో కాఫీ తోటల కొరకు ఎన్నుకోబడింది, మొదటి సారిగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ అటవీ శాఖ యీ సేద్యాన్ని ప్రవేశ పెట్టింది. ఈ విషయంలో తూర్పు గోదావరి, విశాఖపట్టణం జిల్లాల్లోని రంప, గోల్కొండ ఏజెన్సీల కొండ జాతి వారు భాగస్వాములుగా ఉన్నారు.

కాఫీ పథకం 1960 సంవత్సరం నుండి అమలు చేయబడి అభివృద్ధి చెందింది, ఈ పథకంముఖ్యలక్ష్యం ఏజెన్సీ స్థలాల్లోని గిరిజనుల సామాజిక-ఆర్థిక పరిస్థితులను అభివృద్ధ పరచడం.

ఇప్పటి వరకు కాఫీ తోటలు గమనించదగిన ఫలితాల నిచ్చాయి. మాచ్‌ఖండ్, దిగువసీలేరు, ఎగువసీలేరు జల విద్యుత్తు ప్రాజెక్టులు విజయ వంతంగా కొనసాగడానికి యీకార్య క్రమాన్ని యింకా తీవ్రతరం చెయ్యాలి.

మొట్టమొదట ఆరుదశాబ్దాల క్రితం యూరోపియన్ మిషనరీలు యిక్కడ కాఫీమొక్కలు నాటినారు. కాని వాటి పెంపుదల విషయంలో వారు చేసిన ప్రయత్నాలు ఫలించకపోవడంచేత పథకం వదులుకో బడింది. కొండ జాతుల ఆర్థిక పరిస్థిని బాగు పరచడానికి వుద్దేశించబడిన 1960 వ సంవత్సరపు ఉద్యమం చెప్పుకోతగ్గది. మారేడుపల్లి, చింతపల్లి, మినుములూరు అనంతగిరి, పంగసార కేంద్రాలలో యీరోజు మనకు 400 ఎకరాల కాఫీసేద్యమున్నది.

విశాఖపట్టణం జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతంలో కాఫీని వృద్ధి జేయడానికి, ముఖ్యంగా గిరిజనులకు తగినపని, వేతనాలు కల్పించి వారి జీవన ప్రమాణాలను పెంచడానికి, హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టుల పైన దుష్ఫలి తాలను కలిగి యున్న పోడు సేద్యం నుండి వారిని మరల్చడానికి ఒక పథకం యేర్పాటు చేయబడింది. 1965 లో కాఫీ మొక్కలను ఉచితంగా పంచి పెట్టే పథకం ఒకటి ప్రవేశ పెట్టబడింది. గిరిజనులకు 12,000 మొక్కలు పంచి పెట్ట బడినవి. కాఫీ పైరును సక్రమ పద్ధతులలో పెంచడానికి తగిన సాంకేతిక సహాయం గూడా వారికి దొరుకుతున్నది.

మూడవ ప్రణాళికా కాలంలో పెట్టబడిన ఖర్చుకు రెట్టింపు అనగా 62,30,000 రూపాయలు నాల్గవ ప్రణాళికా కాలంలో అటవీ శాఖ యిందునిమిత్తం వ్యయం చేస్తున్నది. కాఫీ సేద్యాన్ని 650 ఎకరాలకు పైగా పెంచడాన్ని గూర్చి. ప్రతి సంవత్సరం 26,000 కాఫీ మొక్కలను పంచిపెట్టడాన్ని గూర్చి ప్రతిపాదన లున్నవి. నాల్గవ ప్రణాళిక అంతానికి, ఎన్నుకో బడిన అయిదు కాఫీ కేంద్రాల్లో 1,500 మంది పని చేయగలరని అంచనా వేయబడింది.

లాభ ప్రదంగా కాఫీని పెంచడానికున్న సాంకేతిక అవకాశాన్ని నిర్ణయించుటకు 1959 వ సంవత్సరంలో విశాఖ పట్టణం, తూర్పు గోదావరి జిల్లాల ఏజెన్సీ ప్రాంతాలలో కాఫీ బోర్డ్ చేత సర్వే జరుప బడింది. 60 అం॥ మొదలు 70 అం॥వరకు వర్షము 2,500, నుండి 3,400 వరకు ఎత్తు గల విశాఖపట్టణం, తూర్పు గోదావరి జిల్లాలలోని 2,800 మైళ్ళ భూమి దీనికి అనుకులంగా వున్నదని, వార్షిక గరిష్ఠ ఉష్ణోగ్రత 80.990ఫా. నుండి 92.60 ఫా. మధ్య, వార్షిక కనిష్ఠ ఉష్ణోగ్రత 54.50 ఫా. నుండి 65.90 ఫా. మధ్యగల యీ ప్రదేశంలో శీతోష్ణ స్థితిననుసరించి కాఫీ పెరుగుతుందని తెలుసుకొనబడింది.

సాధారణంగా కాఫీ పంటకు లోతైన బంకమన్నుగల సార వంతమైన నేల అనుగుణంగా వుంటుంది. ఈ ప్రదేశంలో వేడి వాతావణం కాఫీ పంటకు మరింత ప్రోత్సాహాన్నిస్తుంది.

## గిరిజన ఆర్థికాభివృద్ధి :

రంప ఏజెన్సీ కల యీప్రదేశంలో ఆర్థికంగా, సామాజికంగా వెనుక బడిన గిరిజనులు నివసిస్తున్నారు. ఈ కొండ ప్రాంతంలో వారికి ఉద్యోగాలను కల్పించి, వారి జీవనస్థాయిని హెచ్చించ టానికి చేపట్టిన యీ పథకం ప్రశంసనీయ మైనది. మొత్తం సంవత్సరంలో కాఫీ మొక్కలకు సంబంధించిన వేర్వేరు పనులను నిర్వహించడానికి వంద ఎకరాల ప్రతియూనిటుకు కనీసం 75 మందైనా కావలసి వుంటుంది. ఉద్యోగాలను కల్పించడమే గాక బీదగిరిజన రైతుల జీవన ప్రమాణాలను మెరుగు పరచడానికి, వారి వేతనాలు రెండు, మూడు రెట్లు పెరగడానికి యిది

తోడ్పడ గలదు. ఆర్థికంగానే గాక మంచి గృహాలు, శుభ్ర మైన నీరు మొదలగు ఆరోగ్య వసతులు గూడ కల్పించ బడ్డాయి.

ఎకరానికి 600 నుండి 900 వరకు కాఫీ మొక్కలు నాటుతారు. మొక్కలకు నీడ పడుటకు పై సంఖ్యలో నాల్గవ భాగం మొక్కలను గూడ నాటుతారు. మొక్కలు నాటే విధానం నీటి ప్రవాహాన్ని క్రమపరుస్తుంది. నీడ కొరకు నాటిన మొక్కలు సరిగ్గా నేలపై వాన పడకుండ ఆపుతాయి. ఈ పరిస్థితుల క్రింద మట్టి కొట్టుకొని పోదు. మట్టి తినివేయడం చాలా మేరకు అణిగి పోతుంది.

నిజానికి కాఫీ సేద్యం మట్టి హరించడాన్ని ఆపుతుంది. ప్రతి సంవత్సరం రాలిన మొక్కల ఆకుల వలన నేలలో "మైక్రోబియల్ ఆక్టివిటీ" ఉద్భవించి సేద్యానికి అనుకూలంగా వుంటుంది. దీనిపై శాస్త్ర పరిశోధనలు నేలను సారవంతం జేయడానికి సహాయం చేస్తాయి. ఈ పద్ధతి తగిన ఫలితాన్ని సాధించడానికి చాలా సమయాన్ని తీసుకున్నప్పటికిని ప్రస్తుత పరిస్థితులలో యిదొక్కటే మార్గంగా కనిపించు చున్నది.

నాటిన మూడు సంవత్సరాల తరువాత కాఫీ, కోతకు వస్తుంది. ఈ మధ్య కాలంలో ఎకరానికి 1,500 రూపాయల నుండి 2,000 రూపాయలు పెట్టుబడి కావలసి వుంటుంది. నాల్గవ, ఐదవ సంవత్సరాలలో ఎకరానికి 4 నుండి 6 హండ్రడ్ వెయిట్లకంటె తక్కువ పంట నిస్తుంది. ఆ తరువాత ప్రతి ఎకరంలో స్థిరమైన అభివృద్ధి వుంటుంది. 8 సంవత్సరాల తరువాత పొదలు చక్కగా పెరిగి ఎకరానికి 8 నుండి 10 హండ్రడ్ వెయిట్లు లభ్యమవుతాయి. ఇప్పటి ధర ప్రకారం ప్రతి హం. వె. కు. 150 రూ. మొదలు 180 రూ. లు. దొరుకుతాయి. నాల్గవ సంవత్సరం తరువాత నుండి ఎకరానికి 500 రూ. లనుండి 700 రూ. ల వరకు లభిస్తాయి. పోగా మిగిలిన ఫలితం 300 రూ. ల నుండి 800 రూ. లకు పెరుగు తుంది. లాభప్రదమైన పంట. చూపే శ్రద్ధమీదా, అవలంబించిన శాస్త్రీయ పద్ధతుల మీదా ఆధార పడి వుంటుంది.

## రాష్ట్రంలో ఉత్పత్తి

1960 జులై నెలలో 170 ఎకరాలలో నాటిన కాఫీ మొక్కలు 0.75అం॥ నుండి 1.30అం॥ వర్షం వలన 1963 ఎప్రిల్‌లో ఫలితాన్నిచ్చింది. మొన్ననే కోసిన పంట ఆరు టన్నులని అంచనా వేయబడింది. రాబోయే పంట 2 లక్షల రూపాయల విలువగల 60 టన్నులు వుండ గలదను కుంటున్నారు. క్రింద 400 ఎకరాలలో నాటిన కాఫీ 4 సం. ల తర్వాత 5.12 లక్షల రూ. ల విలువగల 160 టన్నుల ఉత్పత్తిని యీయగలదని అంచనా వేస్తున్నారు. వార్షికపు పంటను పొందడానికి 3 నుండి 3.5 లక్షల రూపాయల ఖర్చు అవసరం.

మన రాష్ట్రంలో కాఫీ సేద్యం విదేశ మారకాన్ని సంపాదించడమేగాక కొండజాతుల వారికి ఆర్థిక వర ప్రసాదం వంటిది. ★

# మన సైన్యంలో చేరండి

సైన్యంలో చేరదలిచిన అభ్యర్థులు సికింద్రాబాదు క్లబ్బుకు ఎదుట గల బ్రాంచి రిక్రూటింగ్ కార్యాలయం ( 219 క్లబ్ రోడ్డు ) తాలూకు రిక్రూటుమెంటు అధికారిని కలుసుకోవాలి. స్కూలు సర్టిఫికెట్లు, గుణగణాలకు సంబంధించిన సర్టిఫికెట్లు శుద్ధ ప్రతులతో పాటు హాజరుకావాలి. ఆఫీసు పనిచేసే రోజులలో ఏరోజైనా ఉదయం గం. 7–30 కు పైఅధికారిని కలుసుకోవచ్చు. అభ్యర్థుల యోగ్యతలకు సంబంధించిన వివరాలను యీదిగువ యివ్వడమైనది.

| ఉద్యోగం | వయ: పరిమితి | విద్యార్హతలు | శారీరక అర్హతలు |
|---|---|---|---|
| గన్నర్స్. జి.డి. | 17నుంచి 21 సంలోపు | VI స్టేండర్డు, ఆపైన | ఎత్తు 5′ 3″, బరువు 105 పౌ ఛాతి 30″/32″ |
| ఇన్ఫేంట్ సిపాయిలు | .. | విద్యార్హతలు లేకున్నా ఫరవాలేదు | .. |
| టెక్నికల్ అసిస్టెంటులు | .. | IX స్టేండర్డు, ఆపైన | .. |
| ఒ.పి. డబ్ల్యు/ఎల్ ఆర్టిలరీ | .. | .. | .. |
| అంబులెన్స్ అసిస్టెంట్లు | .. | VI స్టేండర్డు, ఆపైన | .. |
| మోటారు ట్రక్కుల డ్రైవర్లు | .. | .. | ఎత్తు 5′4″, బరువు 105 పౌ ఛాతి 30″/32″ |
| వర్కుషాపు గ్రూపు | 17 నుంచి 24 సం, | ఎస్.ఎస్.ఎల్.సి/హెచ్.ఎస్.సి లో సైన్సు సబ్జక్టులతో ఉత్తీర్ణులు కావాలి. | ఎత్తు 5′3″ బరువు 105 పౌ ఛాతి. 30″/32″ |
| బి. పి. గ్రూపు | 17 నుంచి 21 సం. | .. | .. |
| నర్సులు/అసిస్టెంట్ | .. | .. | .. |
| ఎలక్ట్రిక్ ఫిట్టర్ (ఎస్) | .. | .. | .. |
| గుమాస్తాలు జి.డి. | 17 నుంచి 27 సం. | ఎస్.ఎస్ ఎల్.సి/హెచ్.ఎస్.సి లో ఉత్తీర్ణులై వుండాలి. | .. |
| వంటవారు (యు) | .. | విద్యార్హతలు లేకున్నా ఫరవా లేదు | .. |
| ఇ.బి. ఆర్ (యు) | .. | .. | .. |
| N.C.s. (E) స్వీపర్లు/మంగలివారు/ చాకలివారు | 17 నుంచి 35 సం. | వారివృత్తిలో సమర్థులై వుండవలెను | ఎత్తు 5′1″ బరువు 105 పౌ ఛాతీ 30″32″ |

## 'నేవీబోయ్స్' గా చేరండి

| | | | |
|---|---|---|---|
| బోయ్స్ ఐ.ఎన్ | 15½ నుండి 16½ సం॥ | IX స్టేండర్డ్‌లో ఉత్తీర్ణులై వుండాలి | ఎత్తు 5″ బరువు 90 పౌ. ఛాతీ28″/30″ |

## డైరెక్ట్ఎంట్రీ నావికులుగా (హెచ్చిరేటింగ్స్) చేరండి

| | | | |
|---|---|---|---|
| స్టోర్స్ అసిస్టెంట్ కమ్యూనికేషన్ సిక్ బెర్త్ అటెండెంట్ ఎలక్ట్రికల్ బ్రాంచి | 17 నుంచి 20 సం. | ఎస్.ఎస్.ఎల్.సి./హెచ్.ఎస్.సి లో ఉత్తీర్ణులై వుండాలి. | ఎత్తు 5′/2″ బరువు 105 పౌ ఛాతీ 30″/32″ |
| సీమెన్ | .. | IX క్లాసు, ఆపైన | .. |
| ఇంజనీర్-మెకానిక్ | .. | .. | .. |

విజయలక్ష్మి వీధికేసి చూస్తూ అరగంటసేపు నిలబడింది. మరి కొంతసేపటికామె ప్రాణం విసిగింది. ఆ విధంగా ఎంత సేపని నిరీక్షించగలదు ? మేడ మెట్లుదిగి కిందికి వచ్చి వీధిగుమ్మం దగ్గిర నిలుచున్నది. అప్పుడేలేచి ఏడుపు మొదలుపెట్టిన చంటి పిల్లని సముదాయించింది. పాప పడుకున్న తరువాత తిరిగి మేడ మీదికి వెళ్లి భర్త పార్థసారథి రాకకోసం వీధి మళుపులన్ని ఎడ తెగని ఏకాగ్ర దృష్టితో పరిశీలించింది. కాని కనుచూపు మేరలో ఎక్కడా అతనిజాడ కనబడలేదు !

ఇటీవల కొంతకాలంనించి పార్థసారథి తిన్నగా వేళ కింటికి రావడంలేదు. కింద హాలులో ఉన్న గోడ గడియారం అప్పుడే టంగు టంగు మని పది గంటలు కొట్టింది !

'ఇంతటి అపరాత్రి దాకా ఇంటికి రాకపోవ డానికి అంత ములిగిపోయే రాచకార్యాలేమి ఉన్నాయి ? కాస్త చీకటి పడకుండా ఇంటికి రాకూడదా ? ఇన్ని ఏళ్ళుపైబడా, ఇంకా ఇంటి సంగతే పట్టించుకోకపోతే ఎలాగ ? ఆ నాటకంగొడవలన్నీ పట్టపగలు చూసుకోకూడదా ? జలుబుతోను, జ్వరంతోను చంటిపిల్ల బొత్తిగా ఊపిరి సలపడం లేదుకదా ! కాస్త డాక్టరు దగ్గిరికి వెళ్లి మందు తేకూడదా ?'



పిలకా గణపతిశాస్త్రి

చిర చిర లాడుతూ విజయలక్ష్మి తిరిగి వీధి చివరల వైపు చూసింది. అల్లంతదూరంలో ఎవరో నడిచి వస్తున్నట్టు కన బడింది. ఎంతో ఆత్రంగా ఆ వ్యక్తిని పరిశీలించింది. కాని చిట్ట చివరికతడు పార్థసారథి కాడని తేలిపోయింది !

దానితో ఆమె ప్రాణం మరింత నిట్టూర్పు విడిచిపెట్టింది. అంతలోనే గోడ గడియారం టంగుమని ఇంకొక అరగంట కొట్టింది. అయినా ఇంకొక అరగంటదాకా అలాగే నిరీక్షించింది. మరి నిలబడలేక కిందికి దిగివచ్చి వంట యిట్లోకి వెళ్ళి కొంగు పరుచుకుని మేను వాల్చింది. భర్త రాక బాగా ఆలస్యం అవుతున్నకొద్ది విజయలక్ష్మి గుండెల్లో బాగా గుబులు బయలుదేరింది. వేడి వేడి కన్నీటి చుక్కలతో చీర చెంగు కొంచెం తడిసింది.

కొంత కాలం క్రితం బాగా ఆలస్యంగా వచ్చినప్పుడు పార్థసారథి భార్య ముఖవైఖరి గమనించి ఎంతో నొచ్చుకుని మున్ముందుగానే మృదువుగా కౌగలించుకున్నాడు. ముంగురులు సవరిస్తూ చెక్కిలి ముద్దుపెట్టుకున్నాడు.

'ఏమి చెయ్యను విజయా ! పెంద్రాళ్లేరావాలనే అను కుంటాను ! కాని రిహార్సలు ఎంతసేపటికి తెమలడం లేదు ! ... చీకటిపడిందాకా ఎవళ్లు అక్కడికి రానడమేలేదు ! ఈ వేళ వాళ్లందరు అక్కడికి రావడం మరింత ఆలస్యమయింది ! లేక పోతే—'

విజయలక్ష్మి తటాలున అతని కౌగిలి పట్టువిడిపించుకుని గట్టిగా నిలవదీసింది.

'పోనీ, ఆ రిహార్సలేవో పగటివేళ జరుపుగోకూడదా ?'

'ఇంచు మించుగా అందరు ఆఫీసుల్లో ఉద్యోగాలు వెలిగిస్తున్న వాళ్లే అయిరి ! మరి పగటివేళ ఎలాగ కుదురుతుంది ?'

'ఏం ? పోనీ ఆది వారంనాడు ఏర్పాటు చేసుకోకూడదా ?'

'నేను అదే ఆలోచిస్తున్నాను. ఇక ముందు ఆది వారం నాడు కూడా జరపాలనే అనుకుంటున్నాను.'

'ఇది మరీ బాగుంది ! ఈ వంక పెట్టి ఇక ఆది వారం పూట కూడా ఇంటి దగ్గిర ఉండరన్నమాట !'

'రిహార్సల్ అంటే ఎంతో సేపా ! రెండు మూడు గంటల్లో తేలిపోదూ ? త్వరగానే వచ్చేస్తానులే !'

తిరిగి నెమ్మదిగా ముంగురులు సవరిస్తూ ముద్దుపెట్టుకుని బ్రతిమాలుకున్నాడు.

కాని ఆనాటి కానాటికి అతనిరాక ఆలాగే ఆలస్యమయింది ! ఆనాడు వెనకటి మాటలకన్న మరింతగా ఆలస్యమయింది !

విజయలక్ష్మి కేమి పాలుపోలేదు. మళ్లీ మేడమీదికి వెళ్లి నాలుగు వైపుల బాగా పరకాయించి చూసింది. ఊరు, వాడ అంతా బాగా మాటుమణిగింది. కాని అప్పుడప్పుడు వీధిలోసాగి పోతున్న ఒంటెద్దు బళ్ల గంటల గణ గణ ధ్వని గుర్రపు బళ్ల చిరుమువ్వల సవ్వడితో కలిసి మంద్ర మంద్రంగా వినిపిస్తూంది.

చెట్ల కొమ్మల్లో తలకిందులు పక్షులు కీచు కీచుమని రొద మొదలు పెడుతున్నాయి. బాగా దుమ్ముకొట్టిన వీధి లాంతర్ల అద్దాలచుట్టు దట్టంగా ముసురుకొన్న దోమల గుంపులు అదేపనిగా అటు, ఇటు కదులుతున్నాయి. ఆ దీపాల వెలుగులు, నక్షత్రాల తళుకులతో కలిసి నల్ల నల్లని మురుగు కాలవల నీళ్లలో అస్పష్టంగా ప్రతిఫలిస్తున్నాయి. కస్సు బుస్సుమంటున్న బావురు పిల్లుల జంట ఒకటి తళ తళ మెరుస్తున్న కళ్లతో తటాలున ఒక గోడమీది నించి దూకి ఇంకొక ఇంట్లోకి పరుగుపెట్టింది.

విజయలక్ష్మికి ఈసారి తొందరగా నడిచివస్తున్న ఇంకొక మనిషి కనిపించాడు. నడకధోరణిని బట్టి అతడు తన భర్తే అయి ఉండవచ్చునని ఊహించింది. కాని గుమ్మం సమీపించేదాకా గట్టిగా నిశ్చయించలేకపోయింది. మరి కొన్ని నిమిషాలలో ఆ సందేహం పూర్తిగా తొలిగిపోయింది! పార్థసారథి కొంచెం ఓరగా తీసి ఉంచిన తలుపు తోసుకొని లోపల అడుగు పెట్టగానే ఆమె మనస్సులో లోపలి ఉక్రోషం భగుమని ప్రజ్వలించింది! మరి భరించలేక వంట ఇంట్లో వట్టి కటికినేలమీద కొంగు పరుచుకొని పడుకొని సన్నని హీన స్వరంతో బుడి బుడి దీర్ఘాలు ఆరంభించింది.

గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టింది. పార్థసారథి అదేసమయంలో లోపలికి వచ్చాడు. విజయలక్ష్మి వీధిగుమ్మంలో కనబడకపోయేసరికి కొంచెం కంగారుపడ్డాడు. కండువా దణ్ణెం మీదికి విసిరివేసి తొందరగా వంటఇంట్లోకి వెళ్లాడు. భార్య భోజనాని కన్నీ సిద్ధం చేసింది. కూర్చోడానికి, చేరబడడానికి పీట అమర్చింది. పక్కన వెండి మరచెంబు పెట్టింది. అరటి ఆకులిస్తరి వేసింది. ఇక వడ్డించడమే తరవాయి. కాని ఆమె అతనిరాక గుర్తించినట్టే కనబడలేదు.

పార్థసారథి భార్య ముఖం రవంతసేపు పరిశీలించాడు. కాటుక కన్నీరు కుడి చెక్కిలిమీద చారికలు కట్టి ప్రవహిస్తున్నది. ముంగురులు ముఖంమీద చిందర వందరగా జీరాడుతున్నాయి.

సుప్రసిద్ధ రచయిత శ్రీ పిలకా గణపతిశాస్త్రి రచించిన ఈ సాంఘిక నవలను 'ఆంధ్రప్రదేశ్'లో ఈ సంచికనుండి ప్రతినెల ధారావాహికంగా ప్రచురిస్తున్నాము. 'విశాల నేత్రాలు' తదితర రచనల ద్వారా వీరు తెలుగు పాఠకలోకానికి సుపరిచితులే.

సంపాదకుడు.

'విజయా! ... విజయా!'

ఆమె నెమ్మదిగా కళ్లు తెరిచింది. బాగా దిగాలుపడినట్టు ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టింది. తిరిగి కనుదోయి ముకుళించింది.

'ఇదేమిటి? ఇలాగున్నావు? ఒంట్లోగాని బాగాలేదా?'

'బాగాలేకేం? నిక్షేపంలా ఉన్నాను.' రుస రుసలాడుతూ సమాధానం చెప్పింది.

'అయితే ఎందుకిలాగ పడుకున్నావు? మళ్లీ నడుం నొప్పి గాని వచ్చిందా?'

'నా నడుం నొప్పిమాటకేంగాని, ముందు కాళ్లు కడుకుని భోజనానికి లేవండి! అన్నం చల్లారిపోతూంది!'

పెద్ద చెంబుతో నీళ్లు, తువ్వాలు పార్థసారథి కాళ్లదగ్గర పెట్టింది. అంతేగాని చేతికందీయలేదు. కన్నెత్తి అతని వైపయినా చూడలేదు! తొందరగా పదార్థాలొకటొకటీ విస్తరిలో వడ్డించింది. పార్థసారథి నెమ్మదిగా పీటమీద చతికిల పడ్డాడు. విజయలక్ష్మి నెయ్యి వడ్డించింది. వేడి వేడి కన్నీటిచుక్కలొకటి రెండు అతని మోచేతిమీద పడ్డాయి. తిరిగి మరి కొంత సేపటికి అన్నము, కూర వడ్డించింది.






'చాలు! చాలు! ఏమిటా వడ్డన! కొంచెం చూసుకొని వడ్డించు!'

పార్థసారథి గట్టిగా కసురుకున్నాడు.

'ఎందుకండీ! అంత రుస రుస! ఏమంత ఎక్కువగా వడ్డించానని!'

'ఈవేళ నాకు అన్నం సయించడంలేదు!'

'ఏం? ఎందుచేత?'

'ఎప్పుడూ ఏడుపుమొహం పెట్టుకొని కూర్చుంటే ఉన్న ఆకలికూడ చచ్చిపోతుంది!' పార్థసారథికి చిరాకు బాగా తల కెక్కింది.

'నా ఏడుపుమొహమే కనిపించిందిగాని, ఇంత అపరాత్రివేళ ఇంటికి జేరుకున్నందుకు మీకు చీమకుట్టినట్టయినా అనిపించిందా?'

'ఏం వస్తే తప్పా!' ధుమధుమ లాడుతూ సూటిగా అడిగాడు.

'తప్పని ఎవరన్నారు? చిత్తం వచ్చినప్పుడు రండి!'

విజయలక్ష్మి గొంతులో గద్గదిక బరువుగా తొణికిసలాడింది.

'ఎందుకాఏడుపు? ఇంతకీ ఏమి పుట్టి మునిగిందని?'

'పుట్టి మునగడాని కేమిఉంది? పాప జలుబుతోను, జ్వరంతోను బాధపడుతూంది కదా! కాస్త పెందార్లే వచ్చి మందు తేకూడదా?'

'ఏదో కొంచెం జలుబుచేసిందిలా ఉంది! దాని కింత గొడవెందుకు? ప్రతి రోజు ఏదో ఒక లేనిపోని వెధవ గోలే!'

'చంటిపిల్ల జ్వరం సంగతి చెప్పినా వెధవ గోలేనా? బాగానేఉంది వరుస! అవును మరి! మనుషుల మీద అసహ్యం పుట్టుకొచ్చిన తరవాత అన్నీ అలాగే కనిపిస్తాయి!'

విజయలక్ష్మి నోట మరి మాట పెగలలేదు. నెమ్మదిగా చీర చెరుగుతో కన్నీరు తుడుచుకున్నది. ఆ సమాధానం పార్థసారథి గుండెలో సూటిగా నాటుకుంది. కొంత సేపటినించి లోలోపల అట్టుడికినట్టుడికి పోతున్న అతడిక భరించలేక పోయాడు! మనస్సు అట్టడుగున నిగ్రహించుకున్న కోపం మరింతగా రెచ్చిపోయింది! తినే తినే అన్నం తటాలున విస్తరి చివరికి తోసివేసి క్షణంలో చెయ్యి కడుక్కొని చర చరా వీధి గుమ్మంవైపు వెళ్ళిపోయాడు.

తన సమాధానంవల్ల భర్త కంతటి దురాగ్రహం కలగగలదని విజయలక్ష్మి చూచాయగానయినా ఊహించలేదు. వెంటనే అతని కెదురుగా వెళ్ళి, చేతులు రెండు గట్టిగా పట్టుకుని తినే తినే అన్నం విడిచిపెట్టి వెళ్ళవద్దని ఎంతో దీనంగా బ్రతిమాలుకుంది. ఇంక ఎంత ఆలస్యంగా వచ్చినా ఆ సంగతే ఎత్తనని, భోజనం ముగించవలసిందని బ్రతిమాలుకుంది.



అంతలోనే పార్థసారథి వీధి గుమ్మందాకా వెళ్లిపోయాడు. అయినా విజయలక్ష్మి తన పట్టు విడిచిపెట్టలేదు! ఇనుమడిస్తున్న దగ్గుత్తికతో మాటి మాటికి ప్రాధేయ పడింది. అయినా అతడామె మాట రవంతయినా చెవికెక్కనీయలేదు! గట్టిగా ఒక్క విదుపు విదిపి, భార్య చేతిపట్టు విడిపించుకుని, తలుపు తెరిచి క్షణంలో వీధిలోకి వెళ్లిపోయాడు! ఆ విదిలింపుతో విజయలక్ష్మి దభాలున నేలమీద కూలబడింది!

ఆ పక్క గదిలో పడుకుని నిద్రపోతున్న ఆమె అమ్మమ్మ ఆ చప్పుడు విని కళ్లు నులుముకుంటూ లేచి, నెత్తిమీద ముసుగు సవరించుకుంటూ అక్కడికివచ్చి ఎంతో కంగారుపడి అడిగింది.

"ఏమిటీ అమ్మడూ ఈ గొడవ?"

"ఏముంది? తింటూ తింటూన్న అన్నం విడిచిపెట్టి వీధిలోకి వెళ్లిపోయారు!"

ఆ సమాధానం విని వర్ధనమ్మ మరింతగా కంగారుపడింది.

"ఎందుకు వెళ్లిపోయాడు? ఏమి జరిగింది?" విజయలక్ష్మి కళ్లు తుడుచుకుంటూ జరిగిన సంగతి అంతా అతి సంగ్రహంగా చెప్పి చెక్కిళ్లమీది జాలు వారుతున్న కన్నీరు చీర చెరగుతోటి ఒత్తుకుంది. అయినా వర్ధనమ్మ ఓదారుస్తున్న ధోరణిలో సన్న సన్నగా చీవాట్లు పెట్టింది.

"చూడమ్మా! మగవాడు తిరక్క చెడ్డాడనీ ఆడది తిరిగి చెడిందనీ ఒక సామెత చెబుతారు! ఒక వేళ ఆలస్యంగా వచ్చినా భోజనాల వేళ లేనిపోని రంధి మొదలుపెట్టకూడదమ్మా! ఇంత అర్ధరాత్రివేళ తినే తినే అన్నం విడిచిపెట్టి ఎక్కడికి వెళ్లిపోయాడో!"

"ఊళ్లో కృష్ణ తులాభారం ఆడుతున్నారుగా! అక్కడికి వెళ్లారేమో!"

వర్ధనమ్మ తిరిగి తన ధోరణి మొదలు పెట్టింది.

"ఇదిగో! కాస్త నా మాట విను తల్లీ! ఆడదానికంతటి అహంకారం కూడదమ్మా! నెమ్మదిగా నచ్చజెప్పాలిగాని అనవసరంగా సంసారం రొష్టు చేసుకోకూడదమ్మా! తెలిసిందా?"

దాని మీద విజయలక్ష్మి తన మనస్సులో ఉన్న అక్కస్సంతా ఒక్క గుక్కలో వెళ్లగక్కింది.

"నువ్వుకూడా తప్పంతా నాదే నన్నట్టు మాట్లాడుతున్నావన్నమాట! ఆయన కింతటి అర్ధ రాత్రివేళ దాకా చక్క బెట్టవలసిన రాచకార్యాలేమి ఉన్నాయి? కాస్త వెలుగుండగానే ఇంటికి వచ్చి పసిపిల్ల మందు సంగతి చూసుకోకూడదా?...... ఈ నాటకాల మూలాన్ని ఇళ్లు, ఒళ్లుగుల్లయి పోవడమేగాని చిల్లిగవ్వయినా చేతిలో పడుతుందా?... ఇన్నాళ్లనుంచి ఓపిక పట్టానుగాని ఇక నేను భరించలేను!"

ఆ దురుసు ధోరణి పసికట్టి వర్ధనమ్మ తిరిగి నెమ్మదిగా బుజ్జగించింది.

"అయ్యో! వెర్రిదానా! భరించక ఏమి చెయ్యగలవమ్మా! ఎలాగో అలాగ కాళ్లా వేళ్లాపడి మంచిమీద లొంగచేసుకోవాలిగాని, లేకపోతే మగవాళ్లకింక పట్ట పగ్గాలుంటాయా?" అలాగ తొందర పడకూడదమ్మా! ఈ వేళ కింక అతను ఇంటికి రాడులా ఉంది! లేచి రెండు మెతుకులు నోట్లో వేసుకో! ...ఇలాగా ఏడుస్తూ కూర్చుంటే పసిపిల్లకూడా బెంబేలు పడి పోతుంది... కాస్త నామాట విని లే తల్లీ!"

అయినా విజయలక్ష్మి వినిపించుకోలేదు. 'నా కీవేళ బొత్తిగా ఆకలి లేదు. ఆపైన శనివారం కూడాను. నేనన్నం తినను... నువ్వు వెళ్లి పడుకో! ఇక నాబతుకింతే! మనమేం చెయ్యగలం? ఎవరి నుదుట ఎలాగ రాసిపెట్టి ఉంటే అలాగ జరుగుతుంది! అంతే!'




అయినా వర్ధనమ్మ రెండేరెండు మెతుకులు నోట్లో పెట్టుకోమని తిరిగి తిరిగి బ్రతిమాలు కుంది. కాని విజయలక్ష్మి ఆమె మాట లక్షపెట్టలేదు. గుడ్లనీరు కుక్కుకుంటూ అలాగె కటికి నేలమీద చీర చెరగు పరుచుకుని పడుకుంది. కాని ఆమె కెంతో సేపటికి కంటికొక్క కునుకైనా పట్టలేదు. తన వివాహానికి మునుపు, ఆతరువాత జరిగిన సంగతులన్ని క్రమ క్రమంగా గుర్తుకు వచ్చాయి. అవి తలచుకొన్నకొద్ది ఆమె మరింతగా కుమిలి కుమిలి దుఃఖించింది. గడియారం మూడుగంటలు కొట్టిన తరువాత విజయలక్ష్మికి కొంచెం కోడికునుకు పట్టింది,—మరి కొంత సేపటికి గాఢంగా మగత నిద్ర కమ్ముకొంది. అంతలోనే ఉలికిపడి పసిపిల్లని నెమ్మదిగా భుజంమీద వేసుకొని మేడమీదకు వెళ్ళి మైమరచి నిద్రపోయింది.

(సశేషం)

# వ్యత్యయము

గుఱ్ఱం జాషువ

సౌధరాజమందు జన్మించె నొక్కండు
పూరిగుడిసెలోన బుట్టె నొకడు
ప్రబలి రందు నిందు, రాజయ్యె నొక్కడు
ఒకడు రాను రాను సుకవి యయ్యె.

అతనిరాజదండ మధికారధనమయం
బితనికలము కావ్య శతకమయము
అతనియిల్లు మేటిరతనాలరుచిమయం
బితనియిల్లు గండవితతిమయము.

కవి నెఱుగు రాజు, రాజున్
గవి యెఱుగున్, గవిని రాజు గణియింపండా
కవి రాజు గణన సేయడు
కవియును రా జిద్ద రాత్మగౌరవకాముల్.

భయముతోడ రాజుఁ బ్రస్తుతింతురు ప్రజల్
భక్తితోడఁ గవిని బ్రస్తుతింత్రు
జీత మిచ్చి రాజు సేవింపఁ బడుచుండు
జీతమీక సుకవి సేవ లందు.

రాజుచేతికత్తి రక్తంబు వర్షించు
సుకవిచేతికలము సుధలు గురియు
ఆత డేల గలుగు యావత్ప్రపంచంబు
ఈత డేల గలుగు నిహము పరము.

రాజు మరణించె నొకచుక్క రాలిపోయె
కవియు మరణించె నొకచుక్క గగన మెక్కె
రాజు జీవించె రాతివిగ్రహములందు.
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు.

# ఆలోచనలూ-అభిప్రాయాలూ

## కవిత్వం, రాజకీయాలు

సాధారణంగా రాజకీయ మహాసభలలోనికి కవిత్వం చొరబడానికి వీలులేదు. అదంతా వచనప్రపంచం. అయితే స్త్రీలున్నచోటికి కవిత్వం రాకుండా వుంటుందా? వారెక్కడవుంటే అక్కడికి సౌందర్యం, సౌకుమార్యం, లాలిత్యం వాటంతట అవే వచ్చేస్తాయి; వాటితోపాటు కవిత్వంకూడా వస్తుంది. రాజకీయాలలో ఎంతగా మునిగి తేలుతున్నదైనా, బొంబాయి ఎ. ఐ. సి. సి. సమావేశంలోనికికూడా కవిత్వం చూడాకుండా పోలేదు. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి తాను నెహ్రూ విధానాల నుంచి వైదొలగుతున్నట్టుగా కొందరు చేసిన ఆరోపణలను ఖండిస్తూ, నెహ్రూ బ్రతికివుండగా ఆయన విధానాలను నిరసించిన వారే ఇప్పుడు వాటిని పట్టుకుని ఊరేగుతున్నారని ఎదురుదెబ్బతీశారు. ఈ సందర్భంలో ఆమె గ్రీక్‌కవి హోమర్‌ను గురించి ప్రచారంలోవున్న ఒక ఇంగ్లీషు పద్యం ఉదహరించారు. —ఒక పత్రిక సంపాదక వ్యాఖ్య.

## మూషిక సంహార ప్రచారం

ఎలుకల బెడదను తొలగించి, ఆహారధాన్యాలు వృధాకాకుండా నిరోధించడానికి జాతీయస్థాయిలో ప్రచారంజరగాలి, ఇప్పుడు నేను మాట్లాడుతున్నది నాలుగుకాళ్ళఎలుకలను గురించే. భారత దేశంలో 250కోట్ల ఎలుకలు కలవని అంచనా. ఆరు ఎలుకలు తినే మొత్తం ఆహారం ఒక మనిషికి సరిపోతుంది. దీన్నిబట్టే ఆహారధాన్యాలను ఎంత మేరకు ఎలుకలు పొట్టన పెట్టుకుంటున్నాయో ఊహించండి. ఎలుకల సంహారానికి విస్తృతమైన ఉద్యమం అవసరం. ఈ విషయంలో కుటుంబ నియంత్రణ పద్ధతి పనికిరాదు —వి. కె. కృష్ణమీనన్

## జ్ఞాపకశక్తి

మరీ మితిమీరిన జ్ఞాపకశక్తి వుండడంకూడా మంచిది కాదేమో. జీవితంలో మరిచిపోదగిన సంఘటనలు చాలా వుంటాయి. ముఖ్యంగా మనస్సును రంపపుకోతకోసే కొన్ని జ్ఞాపకాలు జీవితాంతం మనలను వెన్నాడే పరిస్థితి దుర్భరమైనది. మానవులు కోరుకోదగింది అసాధారణ జ్ఞాపకశక్తికాదు. కావలసిన వాటినన్నిటిని జ్ఞప్తిలో వుంచుకోగలిగి, అక్కరలేని వాటినన్నిటిని మర్చిపోగలిగిన శక్తి! —ఆంధ్రజ్యోతి సంపాదక వ్యాఖ్య.

## సినిమా కథకాదు

ఇటీవల సంభవించిన బెంగుళూరు—పూనా ఎక్స్‌ప్రెస్ ప్రమాదంలో మరణించిన ఒక మృతుని శరీరాన్నిచూసి తనసోదరునిదేనని భ్రమపడిన ఒక వ్యక్తి, రైల్వే ఉద్యోగులు సహాయంగా యిచ్చే 500 రూ. స్వీకరించాడు. ఆ శరీరానికి అంత్యక్రియలు జరిపేశాడు. తీరా యింటికి వెళ్ళేసరికి అసలు సోదరుడు సజీవంగా యింటికి తిరిగి రావడంచూసి ఆశ్చర్యపోయాడు. తనపొరపాటును విశదీకరిస్తూ ఆ వ్యక్తి రైల్వేఉద్యోగుల వద్దనుంచి స్వీకరించిన డబ్బును టి. ఎం. ఓ. ద్వారా త్రిప్పి పంపించేశాడు. —ఒకవార్త.

## ఖైదీసాధించిన విజయం

రాజస్థాన్ విశ్వవిద్యాలయం నిర్వహించిన పియుసి పరీక్షలో ప్రథమశ్రేణిలో కృతార్థుడైన ఏకైకఅభ్యర్థి ప్రస్తుతం యావజ్జీవ కారాగార వాసం అనుభవిస్తున్న వ్యక్తి. ధోల్‌పూర్ సమీపంలో తనతోటి విద్యార్థిని హత్యచేసినందుకు 1963 లో యితనికి 20 సంవత్సరాల ఖైదుశిక్ష విధించారు. 1964 లో మెట్రిక్‌తో సమానమైన పరీక్షలో కూడా యితను మెరిట్‌తో ప్రథమ శ్రేణిలో కృతార్థుడయ్యాడు. —ఒకవార్త.






# చిత్రవార్తలు



కేంద్రప్రభుత్వ నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి శ్రీ ఫఖ్రుద్దీన్ అలీ అహమద్‌కు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, తదితర మంత్రులు మే 14న స్వాగత మిచ్చారు.



కేంద్రప్రభుత్వ నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి, నవాబ్ అలీ నవాజ్ జంగ్ బహద్దుర్ చిత్రాన్ని ఇంజనీర్ల సంస్థలో మే 15న ఆవిష్కరించారు. ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ఈ సభను ప్రారంభించారు. కేంద్రప్రభుత్వ నీటిపారుదల విద్యుచ్ఛక్తి సహాయ మంత్రి డా. కె. ఎల్. రావు అధ్యక్షత వహించారు.



కేంద్రప్రభుత్వ నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి శ్రీ ఫఖ్రుద్దీన్ అలీ అహమ్మద్, అంజుమన్ తహఫ్ఫుజ ఉర్దూవారు నిర్వహించిన సభకు మే 14న అధ్యక్షత వహించినప్పటి చిత్రం.



ప్రేక్షకులు.



తూర్పు గోదావరి జిల్లాలో అక్కవరంలో మంగెన వెంకటస్వామి సోదరుల స్మారక ప్రాథమిక వైద్య కేంద్రానికి ఏప్రిలు 18న ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేస్తున్నప్పటి దృశ్యం.



ప్రాథమిక వైద్య కేంద్రం,



ప్రాథమిక వైద్య కేంద్రాన్ని సందర్శిస్తున్న ముఖ్యమంత్రి.



ముఖ్యమంత్రికి లక్కవరం పంచాయత్ సమితిలోని మల్కిపురం బాలభటులు స్వాగతమిస్తున్న దృశ్యం.



కేంద్రప్రభుత్వ పౌరవిమానయాన శాఖ మంత్రి డా. ఎన్. సంజీవ రెడ్డి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పంచాయతీరాజ్య సమ్మేళనాన్ని కాకినాడలో మే 26న ప్రారంభించారు. ఆ సమ్మేళనానికి ముఖ్య మంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు.



ఆ సమ్మేళనానికి విచ్చేసిన కొందరు ప్రేక్షకులు.



తెనాలిలోని కేంద్ర సహకారబ్యాంకు స్వర్ణోత్సవ సమావేశములో పాల్గొనడానికి వచ్చిన నాయకులకు మే 16 న తెనాలి పౌరులు ఘనంగా స్వాగత మిస్తున్నారు.

మే 16న ముఖ్యమంత్రి తెనాలిలో ఆలపాటి వెంకట్రామయ్య స్మారక మార్కెట్ భవనానికి ప్రారంభోత్సవం జరిపారు.





శ్రీ ఆలపాటి వెంకట్రామయ్య చిత్రాన్ని ఆవిష్కరిస్తున్న ముఖ్యమంత్రి.

ముఖ్యమంత్రి విజయవాడ, గుంటూరులలో అగ్ని ప్రమాదానికి
గురి అయిన ప్రాంతాలను జూన్ 2న సందర్శించినప్పటి చిత్రం.





విజయవాడలో అగ్ని ప్రమాదం సంభవించినప్పుడు మంటల్ని
ఆర్పుతున్న అగ్నిమాపక దళం సభ్యులు.

వరంగల్ జిల్లా రంగశాయిపేటలో జూన్ 4న నీటి సరఫరా
రిజర్వాయరుకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేసినప్పటి దృశ్యం.





ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఎన్. అనంతరామన్, ఐ.సి.యస్. పశ్చిమ గోదావరి జిల్లా ద్వారకా తిరుమలలో మహిళా మండలిలో ఉపన్యసిస్తున్న దృశ్యం,



పశ్చిమ గోదావరి జిల్లా కోరమండల్ సిరమిక్స్‌ను సందర్శిస్తున్న ప్రధాన కార్యదర్శి.



1 నెం. ఇ. ఎం. ఇ. సెంటరులో జనరల్ జె. ఎన్, చౌదరీ గౌరవార్థం ఏర్పాటు చేసిన పెరేడు దృశ్యం.



ప్రభుత్వ ముద్రణాలయంలో ప్రచురించబడిన ''ఆంధ్రప్రదేశ్'' జూన్ సంచిక ఆవిష్కరణ సభలో అధ్యక్షోపన్యాసం ఇస్తున్న ఆర్థిక మంత్రి డా॥ ఎం. చెన్నారెడ్డి, సమాచార, కార్మిక, రవాణా మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి పత్రికను విడుదల చేశారు.

మే 27న నెహ్రూ పండితుని రెండవ వర్ధంతి సందర్భంగా రవీంద్ర భారతిలో ఏర్పాటైన సభలో ప్రసంగిస్తున్న శ్రీ తెన్నేటి విశ్వనాథం.





జూన్ 6న మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్లలో ఆర్ట్సు, సైన్సు కళాశాలకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేసినప్పటి చిత్రం.



మే 6న రాజేంద్రనగర్ బ్లాకులో నార్సింగిలో జరిగిన పశు ప్రదర్శనలో బహుమతి పొందిన వారికి బహుమతులను అంద జేస్తున్న ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ శ్రీ ఓ. పుల్లారెడ్డి, ఐ.సి.యస్.

పశు ప్రదర్శనలో పాల్గొన్న ఒక ఎద్దు.





హైదరాబాదునుంచి వెలువడుతున్న సినిమా పక్షపత్రిక 'సినీజనత' ఆవిష్కరణ సభలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి.

# కాలం యొక్క స్వభావం

కొడవటిగంటి కుటుంబరావు

కాలం అనేదాన్ని గురించి తత్వవేత్తలు ఏమంటారో నాకు తెలీదు. నాకు తాత్వికజ్ఞానం దాదాపు ఏమీలేదనే చెప్పవచ్చు. శాస్త్రజ్ఞులు దాన్ని విశ్వంయొక్క నాలుగు కొలతలలో ఒకటిగా పరిగణిస్తున్నారు. అది సభబేకూడా. ఎందుచేతనంటె మూడుకొలతలు కలిగివున్నా, కాలంలో ఉనికిలేని పదార్థం వాస్తవమైనదికాదు. అందుచేత వాస్తవ జగత్తులోని ప్రతి వస్తువుకూ పొడుగు, వెడల్పు మందముతోబాటు కాలంలో ఉనికికూడా ఉండితీరాలి.

అయితే మిగిలిన కొలతలకూ కాలపుకొలతకూ ఒక తేడా ఉన్నది. కాలం కదులుతుంది. మిగిలిన కొలతలలో ఏలాటి మార్పులు కలిగినా అవి కాలాన్ని ఆశ్రయించిజరిగేవే. మరొక తేడా ఏమిటంటే, మిగిలిన కొలతలలో మనం వెనక్కూ, ముందుకూ రావచ్చు! పైకెక్కినవాడు దిగవచ్చు. ఒక దిక్కుగా వెళ్ళినవాడు వెనక్కుతిరిగి రావచ్చు. ఒక్క కాలంలో మాత్రమే మనం వెనక్కూ ముందుకూ వెళ్ళలేం! (అలా వెళ్ళటానికి హెచ్. జి. వెల్స్ ఒక యంత్రాన్ని-టైమ్ మెషిన్‌ను-భావనచేశాడు. అయితే అది అభూత కల్పన మాత్రమే)

కాలానికీ మిగిలిన కొలతలకూ గల ఇంకొక తేడా ఏమిటంటే, మిగిలిన కొలతలలో మనం కదలగలిగిందయినా కాలపు కొలతలోవే. మనం ఒక ఊరునుంచి ఇంకొక వూరకు వెళ్లి, మొదటి వూరికి తిరిగిరావచ్చు. ఆ వూరు ఏకొలతలోనూ కదలకపోయినా కాలం కొలతలో కదిలింది. మనస్థాణువులుగా భావించేవికూడా కాలం కొలతలో కదులుతూనే వున్నాయి. కాలానికీ కదలికకూ ఇలాటి అవినాభావసంబంధం ఉండటం చేతనే ఒకే వస్తువు ఒకే క్షణంలో రెండు చోట్ల ఉండలేదు.

దేవుడనేవాడు చైతన్యస్వరూపుడైతే, వాడు విధిగా కాలస్వరూపుడుకూడా కావాలి. ఏ కారణంచేతనైనా కాలం స్తంభించిపోతే మూడుకొలతల జగత్తులో జరిగే కర్మకాండ అంతా నిలిచిపోతుంది. విద్యుదయస్కాంత తరంగాలు కాంతి కిరణాలతోసహా-ప్రసారంకావు; ఆఖరుకు పరిమాణములో కేంద్రకాలచుట్టూ తిరిగే ఎలక్ట్రానుల గమనంకూడా నిలిచిపోతుంది. పదార్థం తన గురుత్వాకర్షణ శక్తులను కోల్పోతుంది. అయితే కాలం స్తంభించదు. దాన్ని స్తంభింపజేయగల శక్తి సృష్టిలో ఏదీ ఉన్నట్టు కనబడదు.

ఇలాంటి కాలాన్ని మనం భూత వర్తమాన భవిష్యత్తులుగా విభజించుకొంటున్నాం. జరిగినది, జరుగుచున్నది, జరుగబోతున్నదీ- ఇవి అందరము అర్థం చేసుకోగలమనే అనుకుంటాం. కాని సూక్ష్మంగా పరిశీలించినట్టయితే మనకు అవి అంత బాగా అర్థం కావని తేలుతుంది.

మహా సరళంగానో, అమిత సుగుణంగానో కనబడే ఈకాలవిభజనను కొంత అయోమయంలో పెట్టిన వాళ్లు శాస్త్రవేత్తలు. ఆకాశంలో మనం అనేక నక్షత్రాలను, నక్షత్ర కూటాలను చూస్తున్నాం. కాని వాటినుంచి కాంతి వచ్చి మనను చేరుకొనటానికి ఏళ్లూ, శతాబ్దాలూ, సహస్రాబ్దాలూ పడుతుంది. మనకు అన్నిటికన్న దగ్గరగాఉండే నక్షత్రంనుంచి కాంతి మనని చేరడానికే నాలుగేళ్ల చిల్లర కాలం పట్టుతుంది. కొన్ని నక్షత్రకూటాలు మనకు అనేక లక్షల, కోట్ల 'కాంతి సంవత్సరాల' దూరాన ఉన్నాయి. వాటిని మన ఇవాళ చూస్తున్నామంటె ఇవాళ ఉన్నట్టు చూడటంలేదు. పూర్వం ఎప్పుడో ఉన్నట్టుగా చూస్తున్నాం. మాటవరుసకు ఒక సాధారణ తార పేలి, తనకాంతిని కొన్ని వేల రెట్లు పెంచుకొని, మనం చూస్తుండగానే "నవతార" అయిందనుకోండి అది ఏ 90 వేల కాంతి సంవత్సరాల దూరానో ఉండే పక్షంలో మనం ఇవాళ చూసిన పేలుడు 9( యేళ్ళ కాలం నాటి దన్నమాట. అలాగే మనం మనకు అత్యంత సన్నిహితంగా ఉండే తారా ప్రాంతాల్లో ఉండి భూమి మీది వివరాలు సూక్ష్మంగా చూడగలిగామనుకోండి. జవహర్ లాల్ నెహ్రూ ఇంకా జీవించే ఉంటాడు, లాల్‌బహదుర్ శాస్త్రి ఇంకా ప్రధాన మంత్రి అయిఉంటాడు.

ఈ విధంగా చూసినట్టయితే "గతం" అనేది కళ్లముందే, మన వర్తమానంలోనే-గోచరం కావచ్చు. శాస్త్రవేత్తలూ సాపేక్ష సిద్ధాంతాలు ఈ విషయాన్ని స్పష్టంచేశాయి. గతంలో జరిగిన సంఘటనలు అయిఉండే పక్షంలో అవి భిన్న కాలాలలో జరిగినవైనప్పటికీ, జగత్తులో ఏదో ఒక ప్రదేశం నుంచి చూసి, ఒకేక్షణంలో జరిగినవిగా గమనించవచ్చు.

కాని భవిష్యత్తు గురించి ఇలా చెప్పటానికి లేదు. జరగని సంఘటనను విశ్వంలో ఏమూలనుంచి మనం గమనించలేం. అంటే కాలగమనం ముందుకే గాని వెనక్కులేదు. జరగబోయేది చూడటానికి ఏలాటి భౌతికమైన సదుపాయమూ లేదు. ఇదిశాస్త్రం.

ఈ విషయం ఇక్కడ వదిలేసి ఒక కుశంక లేవదీస్తాను. వర్తమానమనేది లేదు. దాన్ని మనం శాస్త్రీయంగా నిర్వచించలేం. దాని ప్రమాణాన్ని అసలే ప్రతిపాదించలేం. వర్తమా

నమనేది ఒక రోజా, గంటా, నిమిషమా, లిప్తా, లిప్తలో సహస్రాంశమా? ఎంత? నిత్యజీవితంలో ఈ వర్తమానం యొక్క ప్రమాణం సమయోచితంగా మారుతుంది. ఒకడు స్నానంచేస్తున్నాడు. స్నానంముగిసేదాక పట్టేకాలం వర్తమానం. గ్రామఫోను పాడుతున్నది, రికార్డునుబట్టి అది పాడటం మూడు నిమిషాలు పట్టవచ్చు, ఆరు నిమిషాలు పట్టవచ్చు, ఇరువై నిమిషాల చిల్లర పట్టవచ్చు. ఆ జరిగేపని పూర్తి అయ్యేదాకా అది వర్తమానమే

సాధారణంగా ఒక అనుభవం "గతం" అయితేనేగాని దాన్ని గురించి మనం తెలుసుకోలేం. సూర్యుడు ఉదయించటం ప్రారంభమయ్యాకనే మనం సూర్యుడు ఉదయిస్తున్నాడంటాం. ఆలాగే మిగిలిన విషయాలు కూడాను.

మనజ్ఞానేంద్రియాలన్నీ కూడా జగత్తును గురించి తెలుసుకోవటానికి కొంత కాలం-కొద్ది కాలమే కానివ్వండి-అవసరమవుతుంది. ఒక్క కాంతి తరంగాన్ని చూసి ఇది పసుపుపచ్చ రంగు అని కన్నుగాని, ఒక ధ్వని కంపనాన్ని విని ఇది ఫలాని స్వరం అని చెవిగాని చెప్పలేదు. అనుభవాలు మెదడుకు నరాల వెంబడి చేరి అక్కడి జ్ఞాన విభాగాలను చైతన్యవంతం చెయ్యటానికి కాలం పట్టుతుంది. అందుచేత మనకు ఒక ఘటన గురించిన "జ్ఞానం" కలిగే సరికే ఆఘటన కొంతవరకైనా గతంలోకి వెళ్ళిపోయి వుంటుంది.

అదేవిధంగా భవిష్యత్తుకూడా కేవలం శాస్త్ర దృష్టితో చూసి భావించినంత అయోమయంకాదు. ఇంకో నూరేళ్ళ అనంతరం కలగబోయే సూర్య గ్రహాలను కొద్ది సెకండ్ల వ్యత్యాసంతో చెప్పవచ్చు. పుట్టిన వాళ్ళంతా చచ్చిపోయి తీరుతారని రూఢిగా అందరికీ తెలుసు. అసంఖ్యాకమైన విషయాలలో మనం భవిష్యత్తును ఇంచుమించుసరిగానే అంచనా వెయ్యగలుగుతున్నాం. ఆ అంచనాపైన ఆధారపడి మన కార్యక్రమాలను నిర్ణయించుకుంటున్నాం. ఈ కార్యక్రమాలలో హెచ్చుభాగం సరిగానే అమలు జరుగుతున్నాయి. "భవిష్యత్తులో ఏముందో ఎవరుచెప్పగలరు?" "రేపు నీదికాదు; ఇవాళే అనుభవించు," ఇలాటిమాటలు నిరాశా భావంనుంచీ జీవితంలో ఓటమినుంచీ పుట్టినవి. మానవ జాతియొక్క పురోగమనానికి ఒక తిరుగులేని కొలతబద్ద భవిష్యత్తును ఎంత కచ్చితంగా అంచనా కట్టగలమన్నది. అంచనాలు ఎడా పెడా తప్పుతూండడం వ్యక్తియొక్క అసమర్థతకూ, జాతియొక్క అసమర్థతకూ కొలతబద్దలు.

భవిష్యత్తును వీలయినంత నిర్దుష్టంగా అంచనా కట్టటానికి విజ్ఞులు సర్వతోముఖ ప్రయత్నాలు చేస్తున్నారు. ఇక్కడ కూడా శాస్త్ర విజ్ఞానం సహాయపడుతున్నది. వాతావరణంలో కలగబోయే మార్పులూ, ఎన్నికల అనంతరం కలగబోయే ఫలితాలూ, రాబోయే భూకంపాలూ, ఆర్థిక పరిస్థితులూ, ఫలసాయాలూ ముందుగా తెలుసుకునే మార్గాలు

ఆధునిక నాగరికతలో అతి ముఖ్యమైన స్థానం సంపాదించుకున్నాయి. వారఫలితాలు ఈ నాగరికతకు పారడీలాటివి.

గతానికి భవిష్యత్తుకు మధ్య వర్తమానాన్ని ఊహించుకుంటూ జీవించే మనం గతాన్ని నిర్లక్ష్యంగాచూస్తే భవిష్యత్తు లేకుండా పోగొట్టుకున్నవాళ్ళ మవుతాం. భవిష్యత్తును లక్ష్యపెట్టక పోయినట్టయితే వర్తమానం మనని కుంగదీసేస్తుంది. గతాన్ని మరవకుండా భవిష్యత్తును అంతో ఇంతో సరిగా అంచనా కట్టినప్పుడే వర్తమానం సార్థకమనిపిస్తుంది. జీవితానికి విలువ ఏర్పడుతుంది.

* * * * *

ఇటీవలి పత్రికలలో భవిష్యత్తు విషయం కొంత ఘర్షణ జరిగింది. భవిష్యత్తును గురించి తెలుసుకోవచ్చునన్న వారు శాస్త్రజ్ఞానాన్ని ఆశ్రయించక, కొన్ని విశ్వాసాలను ఆశ్రయించారు. మన పురాణాలలో భవిష్యత్తులో జరగబోయేది తెలుసుకున్నట్టు చెప్పబడినవాళ్ళున్నారు. "దివ్యదృష్టి'' గురించి ఉన్నది. తపశ్శక్తో, యోగశక్తో వారి కాశక్తినిచ్చిందనుకోవాలి.

పురాణాలలో చెప్పినవాటిని మనం విశ్వసించ వలసిన పనిలేదు. పురాణాలలో ఉన్నకారణంచేత దేనినిగాని నేను విశ్వసించటానికి సిద్ధంగాలేను. కాని, ఏతపస్సూలేకుండానే, అతిసామాన్య వ్యక్తులు జరగాబోయేది చెప్పటమో, "చూడటమో' చేసిన సందర్భాలు కోకొల్లలుగా ఉంటున్నాయి. వీటిని కొట్టి పారెయ్యటానికి లేదు. కొందరు వ్యక్తులు ఒక్కొక్క స్థితిలో ఏశక్తి సహాయంతోనో, జరగబోయేది ముందుగా చెప్పగలుగుతున్నారు. శాస్త్రజ్ఞులీశక్తులను గురించి తగినంత పరిశోధనలు చెయ్యటంలేదు. దీన్ని "ప్రీకాగ్నిషన్'' అన్నారు. అలాటిది ఒకటి ఉన్నదని గట్టిగానే రుజువుచేశారు. అయితే దానికి గల ఆధారమేమిటో తెలియటంలేదు.

నేను స్వయంగా ఇంకొక విషయం గమనించాను. కలలలో కాలం ఎదురు నడుస్తుంది. చాలామందికి వచ్చే కల ఒకటి ఉన్నది. వాళ్లు ఏకొండమీదికో కలలో వెళతారు. అక్కడ ఏవేవో జరుగుతాయి. అకస్మాత్తుగా వాళ్లు కొండమీద నుంచి పడిపోతారు. గాభరాగా నిద్రలేస్తారు. తీరాచూస్తే వాళ్ళ చెయ్యిదిండు మీదనుంచి పక్కమీదికి పడటమో, లేక అలాటిదే మరొకటో జరుగుతుంది. చెయ్యి పడటానికి వాళ్లు కలలో కొండమీదనుంచి కింద పడటం సంకేతమయే పక్షంలో దానికి కలలో బోలెడంత ఉపోద్ఘాతం ఉంటుంది. ఎంత పెద్ద కల అయినా క్షణంకంటె ఎక్కువ కాలంపట్టదని శాస్త్ర వేత్తలు చెప్పవచ్చు. కాని అప్పటికీ కలగనేవాడికి కాల ప్రమాణం మారిందని ఒప్పుకోక తప్పదు.

అనేక సంవత్సరాల క్రితం నాకు వచ్చిన కల అట్టే పెద్దది కాదు, కాని అందులోని వివరాలు కాలంవెనక్కు నడిచినట్లు స్ఫురింపచేస్తాయి. కలలో నేనొక ప్రదేశంలో నిలబడి ఉన్నాను. మట్టి నల్లగా ఉన్నది. ఎక్కడా ఒక్క గడ్డి పరకకూడా లేదు "ఇదేంప్రదేశం అయిఉంటుంది? శ్మశానం కాదుగద?'' అనుకున్నాను. ఆమాట అనుకున్న మీదట నాకు అక్కడక్కడా బూడిద కుప్పలు కనిపించాయి. "ఇంకేం? ఇది శ్మశానమే! శ్మశానమైతే ఈ చీకటి సమయంలో నక్కలు కుయ్యవేం?'' అనుకున్నాను. ఈ అనుకున్న క్షణంలోనే నాకు నక్కల కూతలు వినిపించాయి. నిద్రలేచాను. ఫాక్టరీలు కూస్తున్నాయి!

ఒక్కటి స్పష్టం — నేను ఫాక్టరీ కూతలను ముందుగానే విని, వాటిని నక్కల కూతలని భ్రమచెంది, శ్మశానం భావన కలిగించుకుని, బూడిద కుప్పలను మానసికంగా సృష్టించి ఉండాలి. కాని ఆబూడిద కుప్పలు కనబడకముందే, ఫాక్టరీ కూతలు వినబడకముందే శ్మశానం అన్నభావం నాతలలోకి వచ్చింది. అందులో ఏమి సందేహంలేదు. చూడగా నేను కలలో కాల గమనానికి ఎదురు వెళ్లాననిపిస్తుంది. అంతకన్న మంచి ఎక్స్ప్లనేషన్ శాస్త్రజ్ఞులిస్తే ఇవ్వవచ్చు. నా కల మాత్రం వాస్తవంగా నేను చెప్పినక్రమంలోనే జరిగింది.

ఇంతా అయాక నేను చెప్పదలచిన విషయమేమంటే, ప్రపంచంలో ఒకరిద్దరు వ్యక్తులే, ఒకటి రెండుసార్లే భవిష్య ఘటనలను చూసినట్టు చెప్పినప్పటికీ భవిష్యత్తుకూ, గతానికీ తేడాలేదేమో నన్న శంక—కుశంకే అనండి—కలుగుతుంది.

రైలు ప్రయాణం చేసేవాడు కొత్తచోట్లను చూస్తూ పోతాడు. అవి వాడు చూస్తుండగా సంఘటించలేదు. అవి అక్కడే ఉన్నాయి. కదలిక వాటిని ప్రయాణికుడి వర్తమానానికి తెచ్చి, గతంలోకి పంపుతున్నది. సినిమాచిత్రం చైతన్యంతోకూడి ఉన్నట్టు ప్రేక్షకుడికి కనిపిస్తుంది. కాని ప్రొజెక్టరునిలిపి ఫిల్మును బయటికి తీస్తే అన్నీ కదలని బొమ్మలే. భూత భవిష్యద్వర్తమానాలన్నీ స్థాణువులుగా ఎదట కనిపిస్తాయి. కాలంకూడా చేతనారహితంగా పరుచుకుని ఉన్నదా? చైతన్యం మన ఎరుకనే ఆశ్రయించి ఉండటంచేత కాల కదులుతున్నట్టు భ్రమకలుగుతున్నదా? ఈసమస్యను తత్వవేత్తలే కొరకాలి. 

---

ఒక హాలీవుడ్ తార పుట్టిన రోజునాడు ఆమె నాలుగో భర్త ఒకపెద్ద హోటలుకి తీసుకెళ్ళాడు. కులాసాగా కబుర్లు చెప్తూ మధ్యలో ఆపి "అన్నట్టు, నీకు జ్ఞాపకంవుందా, మనం నాలుగేళ్ళ క్రిందట యిక్కడే కలుసుకున్నాం. పెళ్ళి చేసుకోవాలని యిక్కడే నిర్ణయించుకున్నాం, జ్ఞాపకంవుందా'' అన్నాడు. అందుకు ఆమె "అవును జ్ఞాపకంలేకేం. పెళ్ళి చేసుకోమని అడిగారు. ఆ సమయంలో రేడియోలోంచి చక్కటి సంగీతం వినిపిస్తోంది. ఆ తన్మయత్వంలో పొరపాటున తల ఊపేను నేను'' అంది.

# అడవి మల్లె

## 15

ఆ రోజు కృష్ణారావు ఇంట్లో జరిగిన సంఘటన హేమ అభిమానాన్నీ, అహంభావాన్నీ, ఆభిజాత్యాన్నీ గాయపరచింది. చంద్రం మీద ఒక విధమైన ద్వేషభావం మొలకెత్తింది ఆమెలో. కాని చంద్రం అంటే ఆమెలో ఏర్పడిన బలీయమైన ప్రేమ కొత్తగా ఉద్భవించిన ద్వేషభావం మీద అధికారం ప్రారంభించింది. ప్రేమా—ద్వేషం—పోరాటం ప్రారంభ మయింది ఆమెలో. ప్రేమిస్తున్న వ్యక్తిని ద్వేషిస్తున్నప్పుడు ఆ హృదయం నరక యాతననే అనుభవిస్తుందేమో! గంభీరంగా, ప్రశాంతంగా వుండే హేమ ముఖంలో దైన్యం, చికాకూ, ఆవేదనా కనిపించసాగాయి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ పరధ్యాన్నంగా వుంటున్న హేమను చూసి ప్రసాదరావు లోలోపల కుమిలిపోసాగాడు.

ఆదివారం. ప్రసాదరావు ఏదో పని మీద బయటకు వెళ్ళిపోయాడు. హేమకు ఆ రోజు మరీ మనస్సు బాగాలేదు. ఉండి ఉండి ఆమె ఆలోచనలు చంద్రం వైపు పరుగెత్తసాగాయి. లైబ్రరీ గదిలో అటూ ఇటూ తిరగసాగింది. అంతకు ముందు హేమకు ఆ గదికి వెళ్తే మళ్లీ బయట ప్రపంచం గుర్తే వుండేది కాదు. కాని ఈ మధ్య బొత్తిగా ఒక పుస్తకం కూడా చదవలేక పోతుంది.

ఏంచేసినా ఎంతకూ సమయం గడవని హేమ ఒక పుస్తకం తీసుకొని వచ్చి వరండాలో కూర్చుంది. గడియారం ఐదు కొట్టింది. నాన్న వచ్చే సమయం అయింది అనుకుంది. చేతిలోని పుస్తకం పట్టుదలగా చదవసాగింది. పేజీలు తిరుగుతున్నాయి. కాని ఆమేమి చదువుతుందో ఆమెకే బోధపడటంలేదు.

ఆ రోజు ఆమె శరీరంలోని ప్రతి అణువూ చంద్రం కోసం తపిస్తున్నట్లనిపిస్తుంది. చంద్రం మళ్లీ తిరిగి తన జీవితంలో ప్రవేశించకుండా వున్నా బాగుండేది. మళ్లీ తిరిగివచ్చి ప్రశాంత సరోవరంలా వున్న తన మనస్సులోకి రాయి విసిరాడు. ఎంత నాటకం! ఎన్ని అబద్ధాలు! ఆ కొద్ది క్షణాల్లోనే తనను ఆశా సౌధాలకు ఎక్కించాడు. పుట్టుకతో పుట్టిన బుద్ధిని మార్చటం ఎవరి తరం! చిన్న తనంలోనే దొంగతనం చేసి ఇల్లు విడిచి పారి

పోయిన ఒక అల్పుణ్ణి తను ఆదర్శమూర్తిగా చిత్రించుకొని పూజించింది. తను చిన్నతనం నుంచీ హృదయ మాధుర్యాన్నంతా చిలకరించి ఎంతో జాగ్రత్తగా పెంచుకున్న ప్రేమ వల్లరి, తెలివి తక్కువగా కళ్లుమూసుకొని నడవటం వల్ల, అది తన కాళ్లకే చుట్టుకుంది. దాన్ని నిర్దయగా తెంచుకొని ముందుకు పోక తప్పదా?

హేమ ఆలోచనలు గౌరి వైపుకు మళ్లాయి. మనస్సంతా జుగుప్సతో నిండిపోయింది. అడవి మల్లె అట అడవి మల్లె! ఎంత మొరటుగావుంది? ఆబజారు పిల్లను తనతో పోలుస్తాడా? తను ఇంత కాలం ఎదురు చూసింది అంత అతి సాధారణమైన అభిరుచులు గల మగవాడి కోసమా? అందరి ముందూ సిగ్గన్నా లేకుండా ఆపిల్ల రెక్కపట్టుకొని ఎల్లా బిరబిర ఈడ్చుకుపోయాడు! ఏలాటి సంబంధం లేక పోతే ఆపిల్ల మీద అతనికి అంత స్వతంత్రం వస్తుంది? హేమకు దుఃఖం పొర్లుకొచ్చింది.

ఇక తను అతని ముఖం కూడా చూడదు. చంద్రం అంటే తనకు పరమ అసహ్యం.

నిజంగా చంద్రాన్ని చూడకుండా తను వుండగలదా? అయితే ఎందుకీ అశాంతి? చంద్రం నిజంగా తనను ప్రేమించటం లేదా! అతను ఈనెల రోజుల నుంచి ఒక సారైనా వచ్చాడా? నిజంగా చంద్రం వస్తే తనలో అతన్ని వెళ్లిపొమ్మని చెప్పగల శక్తివుందా? హేమ ఆలోచనలు బలిసిన గుర్రాలలా పరుగెత్త సాగాయి.

బయటఅడుగుల చప్పుడుకు తల ఎత్తి చూసింది హేమ. ఎదురుగా చంద్రం. గోధుమ వన్నె పెర్లిన్‌షర్టు నల్లటి ట్వీడ్ పాంటులోపలకు వేసుకున్నాడు. పైజమా లాల్చీలో కంటే పొడవుగా అందంగా వున్నాడనుకుంది హేమ. చంద్రాన్ని చూడగానే హేమ ముఖం వెలిగిపోయింది. సంతోషంతో అంతవరకూ వున్న ఆలోచనలన్నీ ఒక్కసారి ఎక్కడకో పారిపోయాయి. తనలో వుబికి వస్తున్న ఆనందాన్ని అతి కష్టం మీద అణచుకుంది. ముభావంగా, తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో అంది.—

"కూర్చో చంద్రం!"

చంద్రం అపరాధిలా హేమకు ఎదురుగా వున్న కుర్చీలో మౌనంగా కూర్చున్నాడు. ఇద్దరి మధ్యా భరించరాని మౌనం. ఇంతలో వంటమనిషి హేమ కోసం కాఫీ తెచ్చింది. మరోకప్పు తెమ్మని చెప్పి తన చేతిలో కప్పును చంద్రానికి అందిస్తూ "కాఫీ తీసుకో చంద్రం," అంది.

కాఫీ కప్పును అందుకుంటూ చంద్రం హేమ ముఖంలోకి చూశాడు. నిర్వికారంగా వున్న హేమ ముఖం చంద్రానికి ఒక సమస్యగా మారింది. ఆనాటి సంఘటన ఆమెమీద ఎలాంటి ప్రభావాన్ని కలిగించలేదా! ఏమీ జరగనట్లే వుందే!

"మరి నీకో" అంటూ కాఫీ కప్పును అందుకున్నాడు చంద్రం ఆలోచనల నుంచి బయటపడుతూ.

## జరిగిన కథ

చిన్ననాడే తల్లిదండ్రులు లేని చంద్రం పదినేద్వారా దొంగగా నిరూపించబడి, తీవ్రంగా శిక్షింపబడి అమాయకపు స్త్రీ అయిన గౌరి సహాయాన బయట పడతాడు. ప్రకాశంను ఆత్మహత్య స్థితినుంచి తప్పించి అతని తండ్రి ఆదరణ ద్వారా చాల గొప్ప స్థితిలోకొస్తాడు. గౌరిని అనాథ శరణాలయంలో చేరుస్తాడు. రజనిని చూచిన తరువాత తాను చిరకాలం నుంచి కలుసుకోవాలనుకున్న హేమను కూడా కలుసుకుంటాడు. తనను కలిసేందుకు వచ్చిన గౌరిని చంద్రం ప్రకాశం ఇంటికి తీసుకు వెడతాడు. అక్కడ గౌరి లేవలేని స్థితిలో ఉండగా, చంద్రం ప్రకాశంలు చాల సహాయం చేస్తారు. ప్రకాశం స్థలంలోనే ఒక చిన్న నిట్టాడి గుడెసెలో వుంటున్న రాజవ్వదగ్గర గౌరిని పెట్టాడు ప్రకాశం. ఆమె బాగోగులు చూస్తున్నాడు.

"ఇదిగో నాకూ వచ్చింది." అంటూ వంట మనిషి తెచ్చిన కాఫీ కప్పును అందుకుంది.

మళ్లీ ఇద్దరి మధ్యా మౌనం. చంద్రం అసలు విషయాన్ని చెప్పటానికి ఇదే తరుణం అనుకొని ప్రారంభించాడు.

"హేమా ఒక విషయం చెబుతాను నన్ను అపార్థం చేసుకోవుగదూ?"

## వాసిరెడ్డి సీతాదేవి

హేమ మాట్లాడ లేదు, ఏమిటన్నట్లు అతని ముఖంలోకి చూసింది.

"ఆరోజు ఆ అమ్మాయి..." హేమ ముఖంలో మార్పును గమనించిన చంద్రం గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టు అయింది. హేమ అదోలా నవ్వింది. ఆనవ్వులో నిర్లక్ష్యం, నువ్వు ఏ అమ్మాయితో తిరిగితే నాకేం కావాలనే భావం స్ఫురించింది చంద్రానికి. చంద్రం మనస్సు చివుక్కు మంది. అంతకంటే హేమ తనను నిందిస్తే, తిడితే, బాగుండేది అనుకున్నాడు.

"చంద్రం! ఉదాత్తమైన ప్రేమను ఇతి వృత్తంగా తీసుకొని ఒక మంచి నవల రాయకూడదూ?" అంది హేమ ధోరణి మారుస్తూ. హేమ గౌరిని గురించి చర్చించటం కూడా తనకు అవమానంగానే భావించింది.

"ఒక నవల సగం రాశాను– మిగతా సగం పూర్తి చెయ్యాలి." అన్నాడు చంద్రంకూడా తెచ్చిపెట్టుకున్న నిర్లక్ష్యంతో.



హేమ, చంద్రం ఇక్కడనుంచి వెళ్ళిపోయాక జరిగిన విషయాలు తెలుసుకోవటానికి ప్రశ్నలు వేసింది. చంద్రం గురుకుల్, కాంగడీలో విద్యార్థి జీవితం ఎలా వుంటుందో వివరించి చెప్పాడు.

ప్రసాదరావు రాకతో వారి సంభాషణకు అంతరాయం కలిగింది. తనను చూసి ప్రసాదరావు ముఖం చిట్లించుకోవటం చంద్రం చూడకపోలేదు.

"నమస్కారమండీ!" అన్నాడు చంద్రం.

"నమస్కారం. ఎంతసేపయింది వచ్చి చంద్రం." అన్నాడు ప్రసాదరావు లేని వుత్సాహం తెచ్చి పెట్టుకుంటూ :

"ఓ గంట అయింది."

"ఇన్ని రోజులకా కనిపించటం ? ఏమిటో అంత తీరని పనులు? " అన్నాడు ప్రసాదరావు నిష్ఠూరంగా.

"రోజూ రావాలనుకుంటూనే రాలేకపోయాను" అన్నాడు చంద్రం.

ఐదు నిముషాలపాటు మౌనంగా అందరూ వారి వారి ఆలోచనల్లో పడిపోయారు.

"చూడు చంద్రం! నీవు నాకు బిడ్డలాంటి వాడివి. నన్ను అపార్థం చేసుకోకు."

ప్రసాదరావు ఉపోద్ఘాతం దేన్నిగురించోఅర్థం చేసుకున్న చంద్రం మౌనంగా వినసాగాడు.

"నిన్ను అభిమానించి ప్రేమించే వాళ్లలో నేనొకణ్ణి, కనుక ఇదంతా చెబుతున్నాను."

"మీరు నాకు తండ్రిలాటివారు. నిరభ్యంతరంగా అడగండి." ఈ విధంగానన్నా తను చెప్పదలుచుకున్నది చెప్పటానికి అవకాశం లభిస్తుందని సంతోషంగా అన్నాడు చంద్రం.

"చూడు చంద్రం! మన అంతస్థులనూ అభిరుచులనూ, సంస్కృతినీ తెలియజేసేవి మన చుట్టూ వుండే స్నేహితులూ, మనం నివసించే ప్రదేశాలూను. నువ్వు ఆ అలగా జనంతో వుంటూ, నిన్ను నీవు క్రిందకు దించేసుకుంటున్నావు. నీతి నియమాలంటే ఏమిటో, సభ్యతా సంస్కృతులంటే ఏమిటో తెలియని ఆ జనంతో నీవు నివసించటం అంత మంచిదికాదు. ఆ రోజు ఆ పిల్ల చూడు ఎలా ప్రవర్తించిందో? అంత మందిలో అలా నన్ను బయట పడేసిందా లేదా? మాంసం తింటే మాత్రం ఎముకల్ని మెడలో వేసుకొని తిరుగుతామా?"

అంటే గౌరితో ఎలాటి సంబంధమైనా వుండవచ్చు. దాన్ని అందరూ తెలుసుకోనంతవరకూ అభ్యంతరం లేదన్న మాట. ప్రసాదరావు దృష్టిలో సంఘంలో అంతస్థు లేనివాళ్లంతా అవినీతి పరులేనా? సంస్కారానికి ప్రతిరూపంగా కనిపించే ప్రసాదరావేనా ఇలా మాట్లాడుతుండేది. భావుకుడైన చంద్రంలో ఆవేశం పెల్లుబికింది.

"అలాటి ఆ వాళ్లు సంఘానికి చీడ పురుగులు. నీలాటి వాడినే వళ్లో వేసుకోగల వీళ్లు ఇంకేం చెయ్యరు? ఇలాంటి వారు స్త్రీ

జాతికే మాయని మచ్చలు, తీరని కళంకాలు'' ప్రసాదరావు కాలేజీ స్టూడెంట్సుకు లెక్చెరిస్తున్న ధోరణిలో చెప్పుకు పోతున్నాడు.

''కొయ్యకు చేవవున్నంత కాలం చీడ పట్టదు. కొందరు స్త్రీలు మీరన్నట్లే సంఘానికి చీడ పురుగుల్లా తయారు కావచ్చు. కాని దానికి బాధ్యు లెవరు? కొయ్యలో బలహీనత వచ్చినప్పుడే చీడ పడుతుంది. అలాగే సంఘంలో బలహీనతే సంఘానికి చీడ పురుగుల్ని తయారుచేస్తుంది. అదిచూసి సంఘాన్ని శాసించే అంతస్థు గలవాళ్లు సిగ్గుపడాలి.''

చంద్రం వుద్రేకంగా అన్నమాటలకు హేమకు వళ్లు మండిపోయింది. చంద్రం ఆ బజారు పిల్లను సమర్థిస్తున్నాడని అసహ్యం వేసింది.

''నువ్వు సమర్థించేవాళ్లు అందమైన శరీరం మీద పుట్టే కురుపు లాంటివారు. చీము, రక్తం కారుతూ చూసేవాళ్లకు జుగుప్సను కలిగిస్తాయి కురుపులు. అందువల్ల ఆ అందమైన శరీరం అంతా కుళ్లిపోయిందనీ, ఈ కురుపుకు కారణం అదేననీ నిందిస్తాం. అలాగే కొందరు బరితెగించి ఆడవాళ్లు వ్యభిచారిణులుగా తయారౌతూ నీతి నియమాలు లేకుండా ప్రవర్తిస్తూ సంఘానికి మానని జుగుప్సాకరమైన కురుపుల్లా తయారవు తున్నారంటే నువ్వు మొత్తం సంఘాన్నే ఎలా నిందిస్తావు?'' అంది హేమ ఆమె ధోరణిలో. ఉద్రేకంకంటే ఉడుకుబోతుతనం ఎక్కువగా ధ్వనించింది.

చంద్రం నవ్వుతూ తాపీగా జవాబిచ్చాడు.

''శరీరం అందంగా పైకి ఆరోగ్యంగా కనిపించ వచ్చును. కాని శరీరంమీద అసలు కురుపు పుట్టటంఅంటే ఆ శరీరం అంతా అనారోగ్యానికి గురి అయిందన్న మాట. రక్తంలో రోగ క్రిములు ప్రవేశించి రక్తాన్నంతా కలుషితం చేస్తున్నా యన్న మాట. ఆ వచ్చిన క్రిములు కురుపు ద్వారా బయట పడకపోతే లోలోపలే ఒళ్ళి రక్తాన్నంతా విషతుల్యంగా మార్చవచ్చు. అంటే ఒక విధంగా ఆ కురుపు ఆ శరీరాన్ని కాపాడుతుంది. అలాగే సంఘం, పైకి చాలా అందంగా కనిపించవచ్చు. పెద్ద మనుషుల్లా సంస్కారపు, ముసుగుల్లో నవనాగరీకుల్లా, నీతిమంతుల్లా కనిపించే ఎందరు తమకు దొరికిన అవకాశాలను ఉపయోగించుకోకుండా వుండగలుగుతున్నారు? అలాంటి వారిలో బయలు దేరిన అనారోగ్యమే కారణం, కొందరి అసహాయులు సంఘానికి కురుపుల్లా తయారు కావటానికి. మనకు చరిత్ర ద్వారా తెలిసిన మొదటి వేశ్య మన దేశంలో అంబాపాలి. ఆమెతోనే అది ఒక వృత్తిగా తయారయినట్లు తెలుస్తుంది. తమ సామ్రాజ్యాన్ని సుస్థిరంగా వుంచాలంటే పెద్ద అధికారులంతా ఐకమత్యంగా వుండాలి. దాని కొరకు అందరికీ ఇష్టమైనదీ, అందరికీ సమానంగా వుపభోగ్యమయినదీ అయిన ఒక వస్తువుండాలని కొందరు రాజనీతిజ్ఞులు అందమైన అంబాపాలీని వేశ్యగా మార్చారు.''

''అంటే నువ్వు అవినీతినీ, వ్యభిచారాన్నీ సమర్థిస్తున్నా వన్నమాట'' అన్నాడు ప్రసాదరావు దుడుకుగా.

''నేను అవినీతిని సమర్థించటం లేదు. అసలు ఏది అవినీతో తెలుసుకో మంటున్నాను. ఆ మాట కొస్తే అవినీతి అనేది దేశ కాలాలను బట్టి మారుతూ ఉంటుంది. మనం దేనిని ఈనాడు నీతి అనుకుంటున్నామో అదికొన్నాళ్ల తరువాత అవినీతిగా పరిగణించ బడవచ్చును.''

''ఆ జనంతో చేరి వాళ్లను వెనకేసు కొస్తున్నావన్న మాట'' ప్రసాదరావు ఈసడింపుగా అన్నాడు.

చంద్రం ఓ క్షణకాలం విస్తుపోయి ప్రసాదరావు ముఖంలోకి దీక్షగా చూసి మళ్లీ ప్రారంభించాడు. (సశేషం)

# ఏకాంకిక రచనా పోటీలు

జిల్లాలలో ప్రచారానికి ఉపయోగించే చిన్న ఏకాంకిక రచనల పోటీ ఒకదానిని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ శాఖ నిర్వహిస్తున్నది. ఆధునిక భారతీయ జీవితంలోని ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక విలువలను వ్యక్తంచేస్తూ, వర్తమాన జాతీయ ప్రయోజనాలను ప్రతిబింబింపచేసే విధంగా ఏకాంకిక ఉండాలి. ఇతివృత్తం సాధ్యమైనంతవరకు ఒకే ప్రధాన అంశానికి సంబంధించినదై ఉండాలి. ప్రచారలక్ష్యం పరోక్షంగా ఉండి ఆధునిక సాంఘిక నాటకాల మాదిరి కళాత్మకంగా ఉండాలి.

1. నాటిక ప్రదర్శన సమయం ఒక గంటకు మించరాదు.
2. పోటీకి రచనను మూడు ప్రతులలో పంపాలి.
3. ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులకు ఎన్నికైన రచనలకు వరుసగా రు. 500; రు. 300; రు. 200 లు ఇవ్వబడతాయి.

ఎంట్రీలు అందాల్సిన ఆఖరు తేదీ 1966 అక్టోబరు 31.

పోటీకి సంబంధించిన అన్ని విషయాలలోను హైదరాబాదులోని సమాచార, పౌరసంబంధ శాఖ డైరెక్టరుదే తుది నిర్ణయంగా ఉంటుంది.

ఎంట్రీలను ఆయన హోదాపేర పంపాలి గాని ఆయన వ్యక్తిగత పేరున పంపరాదు.

# నేను

గుంటూరు శేషేంద్ర శర్మ

పలుక లేదు విధిని పల్లెత్తుమాటేని
కనల లేదు కాలకలన చూచి
ఈసుఁ బూన లేదు కాసున్నవారిపై
గాసి యనక లేమి మోసినాడ.
కాని యొక్కనాడు కాళ్ళ చెప్పులు లేక
దారి నేగుచున్న తరుణమందు
అశ్రులొలికె కాని, అనిశ మెండను మాడు
వాని జూచి చింతమాని నాడ.

అంభోధు లుప్పొంగి యాత్మ బాహువు లెత్తి
స్నేహశీకరములు చినుకుచుండు,
జాబిల్లి కబరిలో సవదరించినబాల—
నీలమేఘము, వానజాలు గురియు,
చివురించి పూచిన చిక్కని యడవులు
కలికితేనియజల్లు చిలుకరించు
బుడుతల వలె కొండయొడినుండి పరుగెత్తు
సెలయేళ్ళు నదులతో చిందు లాడు,

గిరులు దీవించు విప్రులకరణి లేచి
ధరణి మోయును క్షమియించి తల్లివోలె
పుడమి రసమయసృష్టిలో పుట్టి నేను
గాసిబడుచుంటి నిదె ! యేమి కారణమ్మొ ?

అసువుల్ వాతురు నోరులేని నిసువుల్ హా ఆకలోయంచు దు
ర్వ్యసనాయాసనిరాశలం బడి జనం బాగర్భనిర్భాగ్యులై
పసులుంబోలె శ్రమించి చత్తురిచటన్ భావింపగా దారుణం
బస లీలోకము లోకమా విషభుజంగానీక వల్మీకమా ?

తల దాచుకొనుటకు నెలవు జేనెడు లేదు
అనయంబు నాదేశమనుట యేల ?

కడుపు గాలుచు నుండ కనికరించరు గాని
నాజాతి యనుభ్రాంతి నాకు నేల ?
మనిషిగా తల యెత్తి మసల నీయరు గాని
నాదు సంస్కృతి యన్ననయము లేల ?
నామాట గ్రామ్యమై నగుబాటు పాలాయె
నాభాషయన్న యానంద మేల ?

నన్ను బోలినయాపదాపన్నజనుల
నాదుజాతిగ భావింతు నాదరమున
నంతియే కాని దేశ మేదైన నేమి ?
దాసుడను గాను మూఢవిశ్వాసములకు.

దివ్యమై దిగివచ్చు భవ్యభాగీరథి—
నీరు నీకొంగు బంగారు గాదు,
అమరవీధుల నేలు హిమగిరిశ్రేణులు
మనయింటియావులమంద కాదు,
తరులతాబంధుర దండకారణ్యమ్ము
నీదొడ్డిలో బీరపాదు దుదు,
గగన సంవర్తియౌ ఘనభూమివక్షమ్ము
భరతదేశంబు నీపంచ గాదు

స్వార్థభావాలు లోకాన జల్లుదేల ?
కొంచెపుంబుద్ధి నిన్నావరించె గాని
చీమనుండి త్రినేత్రునిభామవరకు
చిల్లిగవ్వయు నీతాతముల్లె గాదు.

శ్రమజీవత్ శతకోటి మానవుల కాశాజ్యోతి లేదా ? విష
క్రిమిబాధామయకాళరాత్రికి నుషఃశ్రీరేఖ జన్మింపదా ?
సమసౌభాగ్యదినమ్ము వచ్చి జగతీసంగ్రామరంగమ్ములన్
రమణీయోజ్జ్వలశాంతిసౌఖ్యమయసామ్రాజ్యమ్ము వర్థిల్లదా ?



# మన నీటి పారుదల ప్రాజెక్టులు

పి. టి. మల్లా రెడ్డి

ఆంధ్ర ప్రదేశ్ 'నదుల రాష్ట్రం' గా ప్రసిద్ధికెక్కింది. అపారమైన భూసంపదతోనూ, నీటి వనరులతోనూ విలసిల్లుతున్న రాష్ట్రం యిది. దేశంలోని పెద్ద అంతర్ రాష్ట్ర నదులలో గోదావరి, కృష్ణ నదులుకూడా చేరివున్నాయి. ఈ రెండు నదులూ, వాటి ఉపనదులూ రాష్ట్ర మధ్యస్తంగా ప్రవహిస్తున్నాయి. ఇవే కాక వంశధార, నాగావళి, పెన్నవంటి నదులూ, అసంఖ్యాకమైన వాటి ఉపనదులూ; సముద్రతీర ప్రాంతాల్లోని శారద, తాండవ, వరాహ, పంపా, ఏలేరు, మున్నేరువంటి చిన్న చిన్న నదులూ రాష్ట్రంలో చాలావరకు భూమిని సారవంతం చేస్తున్నాయి. ప్రస్తుతం మన రాష్ట్రంలో 260 లక్షల ఎకరాల అడుగుల నీరు మాత్రమే ఉపయోగించబడుతున్నది. 160 లక్షల ఎకరాల మెట్ట భూమికి సేద్యపునీటిని అందజేసి, అనవసరంగా నదీజలాలు సముద్రంలో కలిసిపోకుండా లాభసాటిగా చేసుకునే పథకం ఒకటి రూపొందించబడుతున్నది.

రాష్ట్రంలోని భూసంపదను పూర్తిగా వినియోగించుకోవాలంటే నీటి వనరుల్ని అభివృద్ధి పరచుకోవడం చాలా అవసరం. ఈ విషయాన్ని గుర్తించే ఆంధ్ర ప్రాంతంలో ఆరు భారీ నీటిపారుదల ప్రాజెక్టులను, 17 మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టులనూ, తెలంగాణా ప్రాంతంలో 11 మధ్య తరహా నీటిపారుదల ప్రాజెక్టులనూ రాష్ట్రానికి సంబంధించిన తొలి పంచవర్ష ప్రణాళికలో చేర్చడం జరిగింది. తెలంగాణాలో భారీ నీటిపారుదల ప్రాజెక్టులనదగ్గ కోయిల్ సాగర్ ప్రాజెక్టు, భీమనపల్లి ప్రాజెక్టు యించుమించుగా తొలిప్రణాళికాంతానికే పూర్తయ్యాయి. ఆ ప్రణాళికా కాలంలోనే భారీ, మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టుల ద్వారా 31,200 ఎకరాలకు సేద్యపునీటిని అందించడం జరిగింది. తొలి పంచవర్ష ప్రణాళికలో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో అసంపూర్తిగా ఉండిపోయిన ప్రాజెక్టు పనులన్నీ ద్వితీయ ప్రణాళికలో చేపట్టబడ్డాయి. పైగా మరో రెండు భారీ ప్రాజెక్టుల్నీ, 13 మధ్య తరహా ప్రాజెక్టుల్నీ కొత్తగా ఆంధ్ర ప్రాంతంలోనూ; 11 మధ్యతరహా ప్రాజెక్టుల్ని తెలంగాణా ప్రాంతంలోనూ చేపట్టడం జరిగింది.

గత ప్రణాళికల్లో అసంపూర్తిగా వుండిపోయిన భారీ, మధ్యతరహా ప్రాజెక్టులూ, వరద నిరోధక ప్రాజెక్టులూ 12 వరకూ తృతీయ ప్రణాళికలో చేర్చబడ్డాయి. ఇవికాక కొత్తగా పద్దెనిమిది పథకాలు కూడా తృతీయ ప్రణాళికలో వున్నాయి. అయితే యీ పద్దెనిమిదింటిలోనూ ఆరింటిని మాత్రమే అమలు పరచడం జరుగుతున్నది. మిగిలినవాటిని తృతీయ ప్రణాళికలో చేర్చే విషయమై ప్రణాళికా సంఘం వద్దనుంచి యింతవరకు ఏలాంటి నిర్ణయమూ అందలేదు. తృతీయ ప్రణాళికలో చేర్చే అవకాశం లేనప్పుడు ఈ పన్నెండు పథకాలనూ చతుర్థ ప్రణాళికలో కొత్త పథకాలుగా చేపట్టాలని ఉద్దేశించబడింది.

## ప్రణాళికలు—నీటిపారుదల ప్రాజెక్టులు

తొలి పంచవర్ష ప్రణాళికలో భారీ, మధ్యతరహా నీటిపారుదల పథకాలకు రూ. 24.69 కోట్లు ఖర్చయింది. అంటే మొత్తం ప్రణాళికా కేటాయింపు రూ. 94.97 కోట్లలో 23 శాతం అన్నమాట. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వీటికి రూ. 19.33 కోట్లు ఖర్చయ్యింది. అంటే మొత్తం ప్రణాళికఖర్చు రూ. 188.60 కోట్లలోనూ యిది 30.5 శాతం. తృతీయ పంచవర్ష ప్రణాళికలో వీటికింద 27.84 కోట్లు ఖర్చవుతుంది. అంటే తృతీయ ప్రణాళికలో ఖర్చుకావచ్చని భావించబడుతున్న రూ. 344.97 కోట్లలోనూ యిది 26.4 శాతం వుంటుంది. చతుర్థ ప్రణాళిక ముసాయదా ప్రతిలో తెలియజేసిన అంచనా ప్రకారం మొత్తం ప్రణాళికా వ్యయం రూ. 700 కోట్లు కాగా భారీ, మధ్య తరహా నీటిపారుదల పథకాల నిమిత్తం రూ. 75 కోట్లు కేటాయించబడ్డాయి. ఈ వ్యయంలో నాగార్జున సాగర్ ఆనకట్టఖర్చు చేర్చబడలేదు. భారీ, మధ్యతరహా నీటిపారుదల పథకాల క్రింద ఆయకట్టుల అభివృద్ధి చతుర్థ ప్రణాళికలో ఒక కొత్త ప్రత్యేకతను సంతరించుకుంటుంది. గత మూడు ప్రణాళికలవల్ల మొత్తం 9.53 లక్షల ఎకరాలు సాగుక్రిందకు వచ్చాయి. చతుర్థ ప్రణాళికలో నాగార్జున సాగర్ ఆనకట్టతో సహా అన్ని భారీ, మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టులవల్ల అదనంగా 25.13 లక్షల ఎకరాల్ని సాగుక్రిందకు తీసుకురావచ్చు. ఆంధ్ర ప్రదేశ్‌లో భారీ నీటిపారుదల ప్రాజెక్టులను గురించి యీ దిగువ విశదంగా పేర్కొనడం జరిగింది.

## ప్రకాశం బారేజి

1952 సెప్టెంబరులో వచ్చిన వరదలవల్ల కృష్ణానదిమీద గల పాతఆనకట్ట బాగా దెబ్బతింది. ప్రకాశం మంత్రివర్గం పని చేస్తున్న రోజుల్లో—అంటే 1953లో—రోడ్డు, రెగ్యులేటర్ వంతెనను ఒక దానిని (ప్రస్తుతం ప్రకాశం బారేజిగా పిలువబడుతున్నది) నిర్మించడానికి మంజూరు చేయడం జరిగింది. విజయవాడలో కృష్ణానదిమీద యింతకుముందువున్న పాత ఆనకట్టకు ఎగువ ప్రవాహంగా కొద్దిదూరంలో రోడ్డు—రెగ్యులేటర్ వంతెనను నిర్మించడం దీని ఉద్దేశ్యం. దీనివల్ల కృష్ణా డెల్టాలో పాత ఆనకట్ట

సేద్యపు నీటిని అందిస్తూవుండే 10.9 లక్షల ఎకరాలకు సేద్యపు నీరు అందించేగాకుండా అదనంగా ఒక లక్ష ఎకరాల ఆయకట్టుకు సాగు నీటిసౌకర్యం కల్పించబడుతుంది. ఈ పథకం క్రింద మొత్తం ఆయకట్టు 12.25 లక్షల ఎకరాలు వుంటుంది.



ప్రకాశం బారేజి

ఈ ప్రాజెక్టు నిర్మాణాన్ని 1953లో ప్రారంభించి మూడేళ్ళలో పూర్తిచేశారు. చాలా తక్కువ వ్యవధిలోనే దీని నిర్మాణం పూర్తయ్యింది. రెగ్యులేటర్ నిర్మాణంతో పాటు అన్ని ఋతువులలోనూ నదిని దాటడానికి వీలుగా 5వ జాతీయ రహదారిమీద రాకపోకల సౌకర్యంగల వంతెనకూడా నిర్మించబడింది. 1957లో ఈ వంతెనపై రాకపోకలకు ప్రారంభోత్సవం జరిగింది. ఈ పథకం 1961లో పూర్తిగా ఆచరణలోకి వచ్చింది. ద్వితీయ ప్రణాళికా ప్రారంభంలో 50,000 ఎకరాలు సాగుకిందకు తీసుకురావడం జరిగింది. ఈ ప్రాజెక్టుకు మొత్తం రూ 2.77కోట్లు ఖర్చయ్యాయి.

## భైరవుని తిప్ప ప్రాజెక్టు

అనంతపురం జిల్లా, కళ్యాణ దుర్గం తాలూకా, భైరవుని తిప్పగ్రామంవద్ద హగరినదిమీద రెగ్యులేటర్ తలుపులతో మట్టి రిజర్వాయరు నొకదానిని నిర్మించడం యీ ప్రాజెక్టు నిర్మాణంలో ప్రధాన అంశం. రిజర్వాయరు, దానికి యిరుపార్శ్వాలలో చెరొక కాలువ నిర్మాణం ద్వితీయ ప్రణాళికలోనే యించుమించు పూర్తియ్యింది. ఈ ప్రణాళికలో దీనికి రూ 113.29 లక్షలు ఖర్చయ్యింది. దీని క్రింద ఏర్పడే ఆయకట్టు 12,000 ఎకరాలు. తృతీయ ప్రణాళికాంతానికి రెగ్యులేటర్ తలుపుల్ని పైకెత్తడానికి ఎలెక్ట్రిక్ మోటార్లను ఏర్పాటు చేయడం మొదలైన పనులన్నీ పూర్తయి, ప్రాజెక్టు నిర్మాణం పనిపూర్తవుతుంది. తృతీయ ప్రణాళికలో దీనికి రూ 5.3 లక్షలు కేటాయించబడ్డాయి. ఈ పథకానికి మొత్తం రూ 149.08 లక్షల ఖర్చవుతుందని అంచనా.

## ఎగువ పెన్నా ప్రాజెక్టు

ఈ పథకంలో రెండు ప్రధానమైన నిర్మాణాలు ఉన్నాయి. ఒకటి—అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకా పేరూరు గ్రామం వద్ద పెన్నానదిపై ఒక రిజర్వాయరును నిర్మించడం. రెండు—పదమూడు మైళ్ళ పొడవుగల కాలువను నిర్మించడం. ఈ రిజర్వాయరులో 20,000 లక్షల ఘనపుటడుగుల నీరు ఉంటుంది. 12,000 ఎకరాల ఆయకట్టుకు సేద్యపు నీటిని అందించడమే కాక, ప్రధానమైన కాలువద్వారా అనంతపురం చెరువుతోసహా దిగువ లెవల్‌లోగల అనేక చెరువులకు నీటినికూడా అందిస్తుంది. 1950లో దీని నిర్మాణ కార్యక్రమం ప్రారంభించబడి 1958 59లో పూర్తయ్యింది. ఆ ఏడాదే నీటినికూడా విడుదల చేశారు. ద్వితీయ ప్రణాళికలో దీనిమీద రూ 32.09 లక్షలు వెచ్చించడం జరిగింది. తృతీయ ప్రణాళిక కేటాయింపు రూ 0.87 లక్షలు. మొత్తం దీని క్రింద అయిన ఖర్చు రూ 158 లక్షలు.



ఎగువ పెన్నా ప్రాజెక్టు

## రాళ్ళపాడు ప్రాజెక్టు

రాళ్ళపాడు ప్రాజెక్టు రెండవ దశలో ప్రస్తుతంగల మోపాడ్ రిజర్వాయరుకు దిగువగా 20 మైళ్ళ దూరంలో మన్నేరు నదిమీద ఒక రిజర్వాయరును నిర్మించడం, కుడి వైపున కాలువను ఒకదానిని త్రవ్వడం, యింకా చిల్లరపనులు మరికొన్ని వున్నాయి. నెల్లూరు జిల్లాలో సేద్యపు నీటి ఎద్దడిని తొలగించడానికి యీ ప్రాజెక్టు ఉద్దేశించబడింది. తొలి పంచవర్ష ప్రణాళికా కాలంలోనే దీని నిర్మాణ కార్యక్రమం ప్రారంభించబడింది. 1956 మార్చి నాటికి దీని మీద రూ 57.71 లక్షలు ఖర్చయ్యాయి. ద్వితీయ ప్రణాళికలో రూ 31.65 లక్షలు వెచ్చించడం జరిగింది. ఇంచుమించు ప్రాజెక్టు నిర్మాణం పూర్తయ్యింది. దీనివల్ల 7600 ఎకరాలకు సేద్యపునీరు అందింది. తృతీయ ప్రణాళికలో దీనికి రూ 0.94 లక్షలు కేటాయించబడ్డాయి. మొత్తం ఖర్చు రూ 107.91 లక్షలు.

## రొంపేరు డ్రైనేజి పథకం

గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకాలో రొంపేరు డ్రైనేజిని మెరుగు పరచడం, మెట్టభూములకు సేద్యపు నీటి సౌకర్యాన్ని కల్పించి 8,196 ఎకరాల్ని సాగులోకి తేవడం యీపథకం లక్ష్యం. ద్వితీయ ప్రణాళికలోనే యించుమించు యీ పథకం పూర్తయ్యింది అనుకున్నట్టే 8,196 ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యం లభించింది. దీనికి మొత్తం అయిన ఖర్చు రూ 128 02 లక్షలు.

## తుంగభద్ర ప్రాజెక్టు లోలెవెల్ కాలువ

1945 లో అప్పటి హైదరాబాదు, మద్రాసు ప్రభుత్వాలు ఉమ్మడిగా చేపటిన భారీ ప్రాజెక్టులలో యిది ప్రధానమైనది. బళ్ళారిజిల్లా హోస్పేటకు (ఇప్పుడు మైసూరు రాష్ట్రంలో వున్నది) 3 మైళ్ళ పశ్చిమాన తుంగభద్రా నదిమీద రిజర్వాయరును నిర్మించడం తుంగభద్ర ప్రాజెక్టులోని ముఖ్యాంశం. 1954 లో రాష్ట్రాల పునర్విభజన జరిగినందువల్ల ఇది మైసూరు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల ఉమ్మడి ప్రాజెక్టుగా వుంటోంది. తొలి పంచవర్ష ప్రణాళికలో ప్రారంభించబడిన యీ పథకం ద్వితీయ ప్రణాళికలో. యించుమించు నిర్మాణ కార్యక్రమం పూర్తయ్యింది. తృతీయ ప్రణాళికాంతానికి యిది అన్ని విధాలా పూర్తవుతుంది. 45 మైళ్ళ ప్రధాన కాలువ, కర్నూలువైపు 30 మైళ్ళ కాలువ ఆంధ్రప్రదేశ్‌కు సేద్యపు నీటిని అందజేస్తాయి.

ఆంధ్రప్రదేశ్‌లో 1,57,000 ఎకరాలకు, మైసూరు రాష్ట్రంలో 92,000 ఎకరాలకు సేద్యపు నీటిని అందించే విధంగా 2500 క్యూసెక్కుల నీటిని ప్రధాన కాలువ విడుదల చేసేటట్టు రూపొందించబడింది. ద్వితీయ ప్రణాళికలో యీ పథకం మీద రూ. 98.51 లక్షలు వెచ్చించడం జరిగింది. తృతీయ ప్రణాళికలో యిందునిమిత్తం రూ. 46.89 లక్షలు కేటాయించ బడ్డాయి. ఈ పథకం క్రింద మొత్తం రూ. 1391 లక్షలు అవుతుందని అంచనా. తక్కువ ఖర్చుతో శీఘ్రంగా ఫలితాలు పొందగల అవకాశం వున్నందువల్ల తుంగభద్ర లోలెవెల్ కాలువ నిర్మాణ కార్యక్రమం ముందుగా చేపట్టబడింది. లోలెవెల్ కాలువ పని పూర్తయ్యింది. ఆయకట్టు ప్రాంతం యీ పాటికి బాగా అభివృద్ధి చెందింది కూడాను.

## తుంగభద్ర ప్రాజెక్టు హైలెవెల్ కాలువ పథకం

(తొలిదశ)

తుంగభద్ర ప్రాజెక్టు అభివృద్ధికి తీసుకునే చర్యలలో యిది రెండవది. నదీజలాలను పూర్తిగా వినియోగించుకోవడానికి గాను ఆనకట్ట ఒకటి నిర్మించబడింది. ప్రణాళికా సంఘం కేటాయించిన మేరకు తనవంతు జలాలను ఆంధ్రప్రదేశ్ వినియోగించుకుంటుంది. అందువల్ల నీటిని లాభసాటిగా వినియోగించుకునే చర్యలు తీసుకోవడం అవసరం. ఈ పథకం అందుకు ఉద్దేశించబడింది. తుంగభద్ర ఆనకట్ట వద్ద నిర్మించబడిన హైలెవెల్ తూములనుండి విడుదలయ్యే 4000 క్యూసెక్కుల నీటిని తీసుకుపోయే 123 మైళ్ళ పొడవుగల కాలువను త్రవ్వడం యీ పథకంలోని ముఖ్యాంశం. ఈ కాలువ 116 వ మైలు వద్ద ఉరవకొండ కట్ట దగ్గర కొంత నీటిని పెన్నానదిలోకి విడుదల చేయడం జరుగుతుంది.

(ఎ) మధ్య పెన్నానది రెగ్యులేటర్, (బి) మధ్య పెన్నానది దక్షిణ కాలువ, (సి) తాడిపత్రి శాఖతో సహా మధ్య పెన్నా ఉత్తరపు కాలువ —యివికూడా పై పథకం క్రిందకే వస్తాయి. 1959 ఏప్రిల్‌లోనే యీ పథకానికి కేంద్ర జల, విద్యుచ్ఛక్తి మండలి అంగీకారం లభించింది. మధ్య పెన్నానది ఆనకట్ట నుండి మధ్య పెన్నానది ఉత్తరపు కాలువ ఎడమ పార్శ్వంలోనూ, మధ్య పెన్నానది దక్షిణ కాలువ-ఉత్తరపు కాలువ కుడిపార్శ్వంలోనూ వుంటాయి. ఉత్తరపు కాలువకు నాటి ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి 1963 అక్టోబరు 16 న ప్రారంభోత్సవం జరిపారు. ఈ కాలువ అనంతపురం జిల్లాలో సుమారు 13,500 ఎకరాలకు సేద్యపు నీటిని అందజేస్తుంది. దక్షణపు కాలువకు పబ్లిక్‌వర్క్సు శాఖామంత్రి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి 1964 డిశెంబరు 11 న ప్రారంభోత్సవం జరిపారు. అనంతపురం జిల్లాలో 70,615 ఎకరాలకు యిది సేద్యపు నీటిని అందిస్తుంది. ఈ హెడ్‌వర్క్సు, కాలువలు—వీటన్నిటినీ కలిపి మధ్య పెన్నార్ విధానం అనిపేరు. దీనిక్రింద అయిన ఖర్చు రూ. 710 లక్షలు.

1963 లో మధ్య పెన్నానదీ ఉత్తరపు కాలువక్రింద 5000 ఎకరాలకు సేద్యపు నీరు అందించబడింది. ఆమరుసటి ఏడు అనంతపురం, గూటి తాలూకాలలో అదనంగా 28,000 ఎకరాల ఆయకట్టుకు సాగునీటిని అందిస్తూ మధ్య పెన్నానదీ ఉత్తరపు కాలువ ద్వారానూ, దక్షణ కాలువ ద్వారానూ నీటిని విడుదల చేయడం జరిగింది. మైసూరు-ఆంధ్ర సరిహద్దు నుండి ఉరవకొండకట్ట వరకు ఆంధ్రప్రదేశ్‌లో గల హైలెవెల్ కాలువ పొడవు సుమారు 47 మైళ్ళు వుంటుంది. ఈ కాలువ అనేక డ్రైనేజిలను దాటుతూ వెళ్తుంది. ఈ డ్రైనేజి పనులు చాలా వున్నాయి. వీటిలో ముఖ్యమైనవి-80 వ మైలువద్ద చిన్నహగరి అక్విడెక్టు, 96 వ మైలువద్ద పెద్ద హగరిలలో అక్విడెక్టు. ఈ రెండు అక్విడెక్టులు 1966 నాటికి పూర్తికావచ్చు. ఈ రెండు అక్విడెక్టులూ, ఉరవకొండ కట్ట నిర్మాణం పూర్తయితే అనంతపురం జిల్లాలో సుమారు 1.19 లక్షల ఎకరాలకు తుంగభద్ర జలాలను అందించవచ్చు.

## రాజోలిబండ మళ్ళింపు పథకం

ఇది పూర్తిగా నీటి పారుదల పథకం. మైసూరు రాష్ట్రంలోని రాయచూర్ జిల్లాలోగల మున్వి తాలూకాలో రాజోలిబండ గ్రామం వద్ద తుంగభద్రా నదిమీద ఆనకట్టను ఒకదానిని నిర్మించడం యీ పథకంలోని ప్రధానాంశం. దీనిని అప్పటి హైదరాబాదు ప్రభుత్వం చేపట్టింది.

సుమారు 2.9 లక్షల ఎకరాలకు సేద్యపు నీటిని అందించే 89 మైళ్ళ పొడుగు కాలువను ఎడమ పార్శ్వం వైపున త్రవ్వడం జరిగింది. 1956 లో రాష్ట్రాల పునర్విభజన జరిగినప్పుడు హెడ్ వర్క్సు, 27 మైళ్ళ పొడవు కాలువ మైసూరు రాష్ట్రంలోకి వెళ్ళి పోయాయి. 28 వ మైలునుంచి మిగిలిన కాలువ ఆంధ్రప్రదేశ్ లోకి వచ్చింది. ఇది ఉప్పల్, మహబూబ్‌నగర్ జిల్లాలలో వుంది. మైసూరు రాష్ట్రంలో ఈ కాలువ వల్ల 5900 ఎకరాలకు, ఆంధ్రప్రదేశ్ లో 87,900 ఎకరాలకు సేద్యపు నీరు లభిస్తోంది.

ఈ పథకం ద్వితీయ ప్రణాళికాంతానికి యించుమించుగా పూర్తయ్యింది. ఇతర పనుల నిమిత్తం తృతీయ ప్రణాళికలో రూ. 120 లక్షలు కేటాయించబడాయి. 1961లో 25,000 ఎకరాలకు సేద్యపు నీరు అందించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో 40,000 ఎకరాలకు సేద్యపు నీటిని అందించేందుకై కుడివైపునకూడా ఒక కాలువను ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో త్రవ్వాలనే ప్రతిపాదన కూడా ఒకటివుంది. ఈ ప్రాజెక్టుకు మొత్తం అయిన ఖర్చు రూ. 372 లక్షలు.

## కడెం ప్రాజెక్టు

పూర్వటి హైదరాబాదు ప్రభుత్వం బహుళార్థ సాధక గోదావరి ప్రాజెక్టు పథకాన్ని రూపొందించింది. దాని తొలి దశే కడెం ప్రాజెక్టు. అదిలాబాదు జిల్లాలో గోదావరి ఉపనది అయిన కడెం నదిమీద ఆనకట్ట కట్టడం, అదిలాబాదు జిల్లాలో తొలి పంటకు 65,000 ఎకరాలకు, రెండో పంటకు 20,000 ఎకరాలకు_మొత్తం 85,000 ఎకరాలకు_సేద్యపు నీటిని అందజేసే విధంగా రిజర్వాయరు ఎడమ పార్శ్వంలో 48 మైళ్ళ పొడవుగల ఒక కాలువను త్రవ్వడం__ఈ ప్రాజెక్టులో ప్రధానాంశాలు. 1964_65 లో 17,600 ఎకరాల ఆయకట్టు, 1965_66 లో 14,000 ఎకరాల ఆయకట్టు ఉపయోగంలోకి వచ్చింది. తృతీయ ప్రణాళికాంతానికి దీని క్రింద 40,000 ఎకరాల ఆయకట్టు వుంటుంది. 1949 లో ప్రాజెక్టు పనులు ప్రారంభమయ్యాయి



కడెం ప్రాజెక్టు

1958 లో పూర్తయ్యాయి. ఆ ఏడాదే నీటిసరఫరా ప్రారంభం చేయడం జరిగింది. అయితే 1958 ఆగస్టు 31 న వచ్చిన వరదల వల్ల ఈ ప్రాజెక్టు సంబంధించిన మట్టి ఆనకట్ట పగుళ్ళువేసింది. ఈ పగుళ్ళను పూడ్చేపని పూర్తయ్యింది. ఈ ప్రాజెక్టు క్రింద అయిన ఖర్చు రూ. 784.12 లక్షలు.

## పోచంపాడు రిజర్వాయరు ప్రాజెక్టు

నిజామాబాదు జిల్లాలో పోచంపాడు గ్రామంవద్ద గోదావరి మీద ఆనకట్టను నిర్మించే పెద్ద పథకం యిది. దీనికి 1964 ఆగస్టులో ప్రణాళికా సంఘం అనుమతి లభించింది. ఈ పథకం తొలి దశలో గోదావరిమీద ఒక రిజర్వాయరు నిర్మించబడుతుంది. దీని నుంచి ఏటా 66 టి. ఎం. ఘనపుటడుగుల నీరు 70 మై. పొడవు గల కాలువ ద్వారా విడుదలవుతుంది, మొట్టమొదట కరీంనగర్ జిల్లాలోనూ, నిజామాబాదు జిల్లాలోనూ 5.7 లక్షల ఎకరాలకు సేద్యపు నీటిని అందించే విధంగా ఇది రూపొందించబడింది. నదీ గర్భంలో 2550 అ. పొడవు రాతి ఆనకట్టను, దానికి యిరు పార్శ్వాలలోనూ 41,300 అ. పొడవు మట్టి ఆనకట్టలను నిర్మించడం యీ పథకంలో ప్రధానాంశం. దక్షిణ కాలువ



పోచంపాడు రిజర్వాయరు ప్రాజెక్టు

కుడి పార్శ్వం వైపున ప్రధాన మార్గమునుండి బయలుదేరి మానేర్ నదుల సరిహద్దుల వరకు 70 మైళ్ళ ప్రయాణం చేస్తుంది. యీ కాలువను యింకా దిగువకు తీసుకొచ్చి 261 మైళ్ళ పొడవు కాలువగా మార్చి 20 లక్షల ఎకరాలకు సేద్యపు నీటిని అందించడం భవిష్యత్తులో సాధ్యం కావచ్చు. దీనితో తెలంగాణా ప్రాంతంలో కరువు కాటకాలు మటుమాయమైపోతాయి. ఈ ఆనకట్టకు 1963 జూలై 26 న ఆనాటి ప్రధానమంత్రి శ్రీ నెహ్రూజీ శంకుస్థాపన చేశారు.

ఆనకట్టకు సంబంధించిన రాతిపని, డ్రైనేజి, గేలరీ, డ్రిల్లింగ్ పనులు, సిబ్బంది నివాస గృహాల నిర్మాణపు పనులు చురుకుగా సాగుతున్నాయి. ప్రధాన కాలువ పని 1_4 వ మైలుపై

చురుకుగా సాగుతోంది పరిశీలనలు, తదితర ప్రాథమిక పనుల నిమిత్తం ద్వితీయ ప్రణాళికాంతం నాటికి రూ. 32.33 లక్షలు అయ్యింది, తృతీయ ప్రణాళిక కేటాయింపు రూ. 367.14 లక్షలు. పని మొదలు పెట్టింది లగాయతు 1961_65 సంవత్సరాంతానికి అయిన ఖర్చు 261.87 లక్షలు. ఈ ప్రాజెక్టుకు మొత్తం ఖర్చు రూ. 40.10 కోట్లు అవుతుందని అంచనా.

### భారీ నీటిపారుదల ప్రాజెక్టులకు సంబంధించిన కొన్ని వివరాలు

#### ప్రకాశం బారేజి

స్థలం: విజయవాడ
ఆయకట్టు: 12.25 లక్షల ఎకరాలు
ఖర్చు అంచనా: రూ. 391 లక్షలు

#### రొంపేరు డ్రైనేజి పథకం

స్థలం: గుంటూరుజిల్లా
ఆయకట్టు: 8,190 ఎకరాలు
ఖర్చు అంచనా: రూ. 128.02 లక్షలు

#### భైరవుని తిప్ప ప్రాజెక్టు

స్థలం: అనంతపురం జిల్లా, కళ్యాణదుర్గం తాలూకా, భైరవుని తిప్పగ్రామంవద్ద
ఆయకట్టు: 12,000 ఎకరాలు
ఖర్చు అంచనా: రూ. 144.75 లక్షలు

#### ఎగువ పెన్నా ప్రాజెక్టు

స్థలం: అనంతపురంజిల్లా, ధర్మవరం తాలూకా, పేరూరు గ్రామంవద్ద
ఆయకట్టు: 12,000 ఎకరాలు
ఖర్చు అంచనా: రూ. 158 లక్షలు

#### రాళ్ళపాడు ప్రాజెక్టు

స్థలం: మోపడ్ రిజర్వాయరుకు దిగువ 20 మైళ్ళ దూరంలో మన్నేరు నదిమీద
ఆయకట్టు: 7,610 ఎకరాలు
ఖర్చు అంచనా: రూ. 107.91 లక్షలు

#### తుంగభద్ర ప్రాజెక్టు లోలెవల్ కాలువ

స్థలం: తుంగభద్ర ఆనకట్ట హోస్పేట (మైసూరు రాష్ట్రం) కు పశ్చిమంగా 3 మైళ్ళ దూరంలో
ఆయకట్టు: 1,57,000 ఎకరాలు (ఆంధ్ర ప్రదేశ్‌లో), 92,000 ఎకరాలు—మైసూరురాష్ట్రంలో
ఖర్చు అంచనా: రూ. 1391 లక్షలు

#### తుంగభద్ర ప్రాజెక్టు హైలెవల్ కాలువ (తొలిదశ)

స్థలం: తుంగభద్ర ఆనకట్ట, హోస్పేట (మైసూరు రాష్ట్రం)కు పశ్చిమంగా 3 మైళ్ళ దూరంలో
ఆయకట్టు: 1.911 లక్షల ఎకరాలు ఆంధ్ర ప్రదేశ్‌లో, 70,300 ఎకరాలు మైసూరు రాష్ట్రంలో
ఖర్చు అంచనా: రూ. 1180 లక్షలు

### రాజోలిబండ మళ్ళింపు పథకం

స్థలం : రాజోలిబండ (మైసూరురాష్ట్రం) గ్రామం వద్ద తుంగభద్రా నదిపై ఆనకట్ట
ఆయకట్టు : 87,000 ఎకరాలు_ఆంధ్రప్రదేశ్‌లో; 5,900 ఎకరాలు_మైసూరు రాష్ట్రంలో
ఖర్చు అంచనా : రూ. 372 లక్షలు

### కడెం ప్రాజెక్టు

స్థలం : ఆదిలాబాదుజిల్లా కడెంనదిమీద ఆనకట్ట
ఆయకట్టు : 6,5000 ఎకరాలు
ఖర్చు అంచనా : రూ. 781.12 లక్షలు

### పోచంపాడు ప్రాజెక్టు

స్థలం : నిజామాబాదుజిల్లా, పోచంపాడుగ్రామం వద్ద గోదావరినదిమీద
ఆయకట్టు : 5.7 లక్షల ఎకరాలు_నిజామాబాదు, కరీంనగర జిల్లాలలో
ఖర్చు అంచనా : రూ. 40.10 కోట్లు

పెద్దమొత్తాలు పెట్టుబడి అవసరమైన నీటిపారుదల పథకాలద్వారా తక్కువ వ్యవధిలో సాధ్యమైనంత ఎక్కువ ఫలితాలను పొందడానికి ప్రయత్నించాలి. అంతే కాదు

ఈ ప్రాజెక్టులవల్ల మనం సాధించిన ఫలితాలు ముందు ముందు తగిన డ్రైనేజి సౌకర్యాలు లేకపోవడం వల్లగాని, నీళ్ళు ముంపు కలిగినందువల్ల భూములు మురిగిపోవడం వల్లగాని, మరే యితర కారణాల వల్లగాని వ్యర్థం కాకుండా చూసుకోవలసిన అవసరం కూడా చాలావుంది. అందువల్ల తృతీయ ప్రణాళికలో యీ దిగువ వర్గాలకు చెందిన పథకాలకు అధిక ప్రాముఖ్యతను యివ్వడం జరిగింది.

ఎ) మధ్యతరహా నీటి పారుదల పథకాలు

బి) ద్వితీయ ప్రణాళికలో అసంపూర్తిగా వుండిపోయిన పథకాలు

సి) డ్రైనేజి, ముంపు నివారణ పథకాలు.

గోదావరి, కృష్ణవంటి పెద్ద పెద్దనదులకు ఉపనదులుగా ఏర్పడే వాగులమీదా, సెలయేళ్ళమీదా నిర్మించే ఆనకట్టలు మధ్యతరహా నీటి పారుదల పథకాలకోవలోకి వస్తాయి. వరాలుపడి, ఆపడిన నీరంతా కలిసి వాగులుగా, సెలయేళ్ళుగా ప్రవహించి చిన్న చిన్న ఉపనదులై చివరకు అవన్నీకలిసి ఒక పెద్దనదిగా ఏర్పడతాయి. నాగావళి, వంశధార, గోదావరి, కృష్ణ, పెన్న మొదలైన నదుల పరీవాహ ప్రాంతాలను పూర్తిగా అభివృద్ధి పరచాలంటే చిన్నతరహా నీటిపారుదల ప్రాజెక్టులతో వాగులు, సెలయేర్లనీ, మధ్యతరహా ప్రాజెక్టులతో ఉపనదుల్నీ, భారీ ప్రాజెక్టులతో పెద్దనదుల్నీ అదుపులో వుంచు కోవాలి. మొదటిమూడు ప్రణాళికల్లోనూ మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టుల్ని రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో నిర్మించడంవల్ల నీటిపారుదల సౌకర్యాలకు సంబంధించినంతవరకు రాష్ట్రంలోగల అసమానత కొంతవరకు తొలగిపోయింది. మరోరెండు మూడేళ్ళలో మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణం పూర్తవుతుంది. అధికాహారోత్పత్తిని సాధించడంలో భారీనీటి పారుదల పథకాలకన్నా యివేఎక్కువగా తోడ్పడతాయి.

పదిలక్షల రూపాయల పైన, ఒక కోటి రూపాయల లోపూ ఖర్చుఅయ్యే నీటిపారుదల పథకాల్ని తొలి, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మధ్యతరహా నీటిపారుదల పథకాలక్రింద జమకట్టేవారు. అయితే వస్తువుల ధరలు, కూలి పెరగడంవల్ల రూ. 15 లక్షల పైనా, రూ. 2 కోట్లులోపూ ఖర్చుఅయ్యే పథకాలను మధ్యతరహా నీటిపారుదల పథకాలుగా తృతీయ ప్రణాళికలో భావించడం జరిగింది. కాని యిప్పుడు మధ్యతరహా ప్రాజెక్టు అంటేయిచ్చే నిర్వచనం మారింది. ఖర్చుతో సంబంధలేకుండా ఒక వర్కింగ్ సీజనులో పూర్తయ్యే పథకం ఏదైనా మధ్యతరహా పథకం క్రిందే లెక్కించబడుతోంది. మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టు అంటే యిప్పుడు అర్థం—ఆ పథకానికి రూ. 2 కోట్లుకు మించి ఖర్చుకాగూడదు. దీన్నిపూర్తి చేయడానికి ఒక "వర్కింగ్ సీజన్‌కన్నా" ఎక్కువ కాలంపట్టవచ్చు.

# ఆంధ్ర ప్రాంతం

## నారాయణపురం ఆనకట్ట పథకం

శ్రీకాకుళం జిల్లా, నారాయణపురం గ్రామంవద్ద నాగావళి నదిపై 3అ...ఎత్తుగల దించే షట్టర్లతో ఒక ఆనకట్ట నిర్మించడం, ఇరుపార్శ్వాలవైపునా కాలువలను త్రవ్వడం యీ పథకంలోని ముఖ్యాంశం. ఈ పథకానికి రూ 96 లక్షలు ఖర్చుఅవుతుందని అంచనా. ఈ పథకంతాలూకు ప్రధాన నిర్మాణపు పనులన్నీ పూర్తయ్యాయి. కొన్ని అడ్డుడ్రైనేజి పనులుమాత్రం పూర్తికావాలి. 1964 సంవత్సరాంతానికి 27800 ఎకరాలకు సేద్యపు నీటిని అందించడం జరిగింది. ద్వితీయ ప్రణాళికలో దీని క్రింద రూ 55.42 లక్షలు వెచ్చించబడ్డాయి. తృతీయ ప్రణాళిక సవరించబడిన కేటాయింపు రూ 27.22 లక్షలు. ఈ పథకానికి మొత్తం రూ 96.16 లక్షలవ్యయం అవుతుందని అంచనా.

నాగావళినది కుడికాలువ

శ్రీకాకుళంజిల్లా, పార్వతీ పురంతాలూకా, తోటపల్లి గ్రామంవద్ద నాగావళి నదిమీద ప్రస్తుతంవున్న తోటపల్లి రెగ్యులేటర్‌కు కుడివైపున ఒక హెడ్‌స్లూస్‌తో 13మై. 4 ఫర్లాంగుల కాలువను నిర్మించడం యీ పథకం యొక్క ప్రధానోద్దేశం. నిర్మాణం పని పూర్తయ్యింది. నీటినికూడా విడుదలచేయడం జరిగింది.

ద్వితీయ ప్రణాళికా కాలంలో యీపథకంక్రింద రూ 14.37 లక్షలు ఖర్చు అయ్యాయి; నిజానికి దీనికి కేటాయించిన మొత్తం రూ 11.26 లక్షలు మాత్రమే. తృతీయ ప్రణాళిక కేటాయింపు రూ 1.62 లక్షలు. ద్వితీయ ప్రణాళికలో 6,840 ఎకరాలకు సేద్యపు నీటిని అందించాలనేది మన లక్ష్యంకాగా ఆలక్ష్యం మేరకు సేద్యపు నీటిని అందించడం జరిగింది. దీనికి అయిన ఖర్చు రూ 26.23 లక్షలు.

## వేగవతి ఆనకట్ట పథకం

శ్రీకాకుళం జిల్లాలో కర్రివలసవద్ద వేగవతి నది మీద 4 అ. ఎత్తువుండి దించడానికి వీలువున్న షట్టర్లతో 300 అ. పొడవు ఆనకట్టను నిర్మించడం, దానికి యిరువైపుల చెరొక కాలువను నిర్మించడం—ఈ పథకం ఉద్దేశం. కుడికాలువపొడవు 4 మైళ్ళు, ఎడమ కాలువ పొడవు ఆరుమైళ్ళు వుంటాయి. ఈ పథకానికి సంబధించిన నిర్మాణ కార్యక్రమంపూర్తయ్యింది. సేద్యపు పనుల నిమిత్తం నీటినికూడా విడుదలచేయడం జరిగింది.

ద్వితీయ ప్రణాళికలో ఈ పథకంమీద రూ 19.87 లక్షలు వెచ్చించబడ్డాయి. 2,205 ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యం కల్పించబడింది. తృతీయ ప్రణాళికలో దీనికి రూ. 1.38 లక్షలు కేటాయించబడ్డాయి. మొత్తం దీనికి ఖర్చు రూ. 23.32 లక్షలు అవుతుందన్న అంచనా.

## సీతానగరం ఆనకట్ట పథకం

నాగావళికి ఉపనది అయిన స్వర్ణముఖినది మీద బొబ్బిలి తాలూకా, వెంకట భైరవాపురం గ్రామం వద్ద ఒక ఆనకట్టను నిర్మించడం— యీ పథకం ఉద్దేశం. నిర్మాణపు పని కూడా పూర్తి అయింది. వ్యవసాయపు పనుల నిమిత్తం నీటిని కూడా విడుదల చేయడం జరిగింది. ద్వితీయ ప్రణాళికలో యీ పథకం నిమిత్తం రూ. 4.73 లక్షలు కేటాయించబడగా రూ. 7.94 లక్షలు వెచ్చించబడ్డాయి. ద్వితీయ ప్రణాళికా కాలంలో 4,000 ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యాన్ని కల్పించాలన్నది మన లక్ష్యం కాగా ఆ ప్రణాళికా కాలంలో మొత్తం 3,000 ఎకరాలకు సేద్యపునీటిని అందించడం జరిగింది. తృతీయ ప్రణాళికలో దీనికిగాను రూ. 1.07 లక్షలు కేటాయించ బడ్డాయి. దీనికి మొత్తం రూ. 12 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా.

## గంభీరంగడ్డ రిజర్వాయరు పథకం

విశాఖజిల్లా, భీమునిపట్నం తాలూకాలో గంభీరంగడ్డ మీద ఒక ఆనకట్టను, దానికి కుడిపార్శ్వంలో రాతి స్పిల్‌వేను నిర్మించడం-యీ పథకంలో ప్రధాన అంశం. ఈఆనకట్టకు రెండు వైపులా రెండు కాలువల్ని త్రవ్వాలని కూడా ఉద్దేశించబడినది.

ద్వితీయ ప్రణాళికలో యీ పథకం నిమిత్తం రూ 4.46 లక్షలు కేటాయించబడ్డాయి. అయితే ఆప్రణాళికా కాలంలో యీ పథకం మీద రూ 6.49 లక్షలు ఖర్చుచేయడం జరిగింది. 500 ఎకరాలకు సాగునీరు లభించింది. తృతీయ ప్రణాళిక కేటాయింపు రూ 0.17 లక్షలు. ఈ పథకానికి మొత్తం రూ 14 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా.

### బండకట్టు కాలువ పద్ధతి పునరుద్ధరణ

బండకట్టు కాలువక్రింద ప్రస్తుతం మూడు పిల్లకాలువల ద్వారా సేద్యపు నీటిని పంపించడం జరుగుతున్నది. ఈ పద్ధతిని మెరుగుపరిచి, యీ కాలువలన్నిటికీ సమానంగా నీటిని సరఫరా చేసి, తద్వారా ప్రస్తుతం యీ కాలువల క్రిందఉన్న 2,466 ఎకరాల ఆయకట్టుకేగాకుండా అదనంగా 1,186 ఎకరాలకు సేద్యపు నీటిని లభింపజేయాలని ఉద్దేశించబడింది. ఈ పథకంతాలూకు నిర్మాణపుపనులన్నీ యించుమించు పూర్తయ్యాయి. నీటినికూడా 1956లో విడుదలచేయడం జరిగింది. ద్వితీయ ప్రణాళికలో రూ 0.53 లక్షలు దీనిమీద వెచ్చించ బడ్డాయి. తృతీయ ప్రణాళికలో రూ 0.03 లక్షలు దీనికని కేటాయించారు. ఈ పథకానికి మొత్తం రూ 2.92 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

### నక్కలగండి రిజర్వాయరు పథకం

నెల్లూరుజిల్లా, ఉదయగిరి తాలూకాలో నక్కల గండివద్ద ఉప్పువాగు మీద ఒక రిజర్వాయరుని నిర్మించడం యీ పథకం ఉద్దేశం. వాగుకు అడ్డంగా ఒక మట్టి ఆనకట్టను నిర్మించేపని తొలి ప్రణాళికలోనే పూర్తయ్యింది. నీటినికూడా వ్యవసాయపు పనుల నిమిత్తం విడుదలచేయడం జరిగింది. దీనిక్రింద అయిన ఖర్చు రూ 14.79 లక్షలు.

### పాలేరు రిజర్వాయరు పథకం

1,080 అ. పొడవుగల మట్టి ఆనకట్టను, 870 అ. పొడవుగల కాలువను నిర్మించడం యీ పథకం ఉద్దేశం. తొలి పంచవర్ష ప్రణాళికా కాలంలోనే యిదిపూర్తయ్యింది. నీటినికూడా విడుదల చేయడం జరిగింది. దీనికి మొత్తం అయిన ఖర్చు రూ 6.95 లక్షలు.

### ఉప్పుటేరు దిగువ ఆనకట్ట పథకం

నెల్లూరుజిల్లా, కందుకూరు తాలూకా పెద్దపవని గ్రామం వద్ద ఉప్పుటేరు మీద ఒక ఆనకట్టను నిర్మించడం యీ పథకం ఉద్దేశం. కొత్తపేట, బెడిపూడి, లక్ష్మిరాజుపాలెం, భీమవరం, రాజపాలెంలలో గల ఆరు చెరువులకు యిది నీటిని అందజేస్తుంది. ఆనకట్ట నిర్మాణపుపని తొలి పంచవర్షప్రణాళికలోనే పూర్తయ్యింది. దీనికి అయిన ఖర్చు రూ 13.81 లక్షలు.

### కాళంది రిజర్వాయరు పథకం

కాళంది నదిమీద ఒక రిజర్వాయరును, దానికి ఇరువైపులా ఒకటి చొప్పున రెండు కాలువల్ని నిర్మించే పని తొలి ప్రణాళికలోనే పూర్తయ్యింది. 1957లో భారీవర్షాల వల్ల గండ్లు పడినకారణంగా అదనంగా మరికొన్ని నిర్మాణపు పనులు చేపట్టడం జరిగింది. అంజూర్ ఆనకట్టకు గేట్లను ఏర్పాటుచేయడం పూర్తయ్యింది. అంజూర్ ఆనకట్ట ప్రధాన కాలువద్వారా 13 చెరువులకు నీటిని అందజేయడం జరిగింది.

## మల్లిమడుగు రిజర్వాయరు పథకం

చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలో మల్లి మడుగుకప్ప, చిర్లమడుగు తిప్పల మధ్య కట్టలు నిర్మించి స్వర్ణ ఉపనదులైన కొనకాలువ, రాళ్ళ కాలువల పై జలాశయం ఏర్పరచడం ఈ పథకం లక్ష్యం. తొలిపంచవర్ష ప్రణాళికా కాలంలో ముగిసిన ఈ పథకంవల్ల 4,000 ఎకరాలకు లాభించింది.

ఈ పనులకు రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో రూ 13.891 లక్షలు ఖర్చు చేశారు. మూడవ ప్రణాళిక కేటాయింపు రూ. 1.03 లక్షలు. వ్యయం అంచనా రూ. 31.44 లక్షలు.

## దిగువ సాగిలేరు ప్రాజెక్టు

కడప జిల్లాలో పుల్కినేరు సంగమానికి ఎగువన 'S' ఆకారంగల ''స్పిల్ వే'' రెగ్యులేటరుతో మట్టి ఆనకట్ట నిర్మించి సాగిలేరుపై జలాశయం ఏర్పరచడం, 14 చెరువులకు నీరు సర

ఫరా చేసే నిమిత్తం ఎడమ వైపున సుమారు 14 మైళ్ళ పొడవున కాలువ త్రవ్వడం ఈ పథకం ఉద్దేశం. ప్రథమ పంచవర్ష ప్రణాళికాకాలంలో పని ముగిసింది.

రెండవ ప్రణాళికలో కొనసాగింప బడిన ఈ పథకానికి ప్రణాళికా కాలంలో రూ. 28.13 లక్షలు ఖర్చు చేశారు. వ్యయం అంచనా 66.85 లక్షలు.

## పించానది రిజర్వాయరు ప్రాజెక్టు

కడప జిల్లా రాయచోటి తాలూకాలో పలకల గుట్ట సమీపంలో పించా నదిపై రెగ్యులేటరుతో జలాశయం నిర్మించడం ఈ పథకం ఉద్దేశం. రెగ్యు లేటరుకు ఎడమ వైపున అలుగు పారకుండా నిర్మించిన రాతికట్టడం, కుడి పార్శ్వాన మట్టికట్ట వుంటాయి. ప్రథమ పంచవర్ష ప్రణాళికాకాలంలో పథకం పూర్తయింది.

రెండవ ప్రణాళికలో కొనసాగింప బడిన ఈ పథకానికి ఆ ప్రణాళికా కాలంలో రూ. 24.60 లక్షలు వెచ్చించారు. మూడవ ప్రణాళికా కేటాయింపు రూ. 0.57 లక్షలు. వ్యయం అంచనా రూ. 53.15 లక్షలు.

## సిద్దల గండి చెరువు పునరుద్ధరణ

ఈ చెరువుక్రింద 120 ఎకరాలకు నీటిపారుదలచేసే నిమిత్తం చెరువుకు పడిన గండిని పూడ్చడానికి తలపెట్టారు. మొదటి ప్రణాళికా కాలంలో పనిపూర్తయింది. రెండవ ప్రణాళికలో కొనసాగింప బడిన ఈ పథకానికి ఆ ప్రణాళికలో రూ. 6.38 లక్షలు ఖర్చు పెట్టారు. ఖర్చు అంచనా రూ. 6.14 లక్షలు.

## విద్యారణ్య స్వామిగుడి ప్రాజెక్టు

అనంతపురం తాలూకా గంటిమర్రి గ్రామంలోని గండిపడిన చెరువును పునరుద్ధరించి 200 ఎకరాల ఆయకట్టుకు లాభం చేకూర్చడానికి ప్రతిపాదించారు. ప్రథమ ప్రణాళికలో పని ముగిసింది. రెండవ ప్రణాళికలో కొనసాగింప బడిన ఈ పథకానికి ఆ ప్రణాళికా కాలంలో రూ. 0.36 లక్షలు ఖర్చయింది. వ్యయం అంచనా రూ. 2.89 లక్షలు.

## చెన్నరాయన స్వామి గుడి ప్రాజెక్టు

కడప జిల్లాలో బాలసుందరం గ్రామానికి తూర్పున సుమారు 3 మైళ్ళ దూరంలో పాపాగ్ని నదికి అడ్డంగా రాతి రెగ్యు లేటరు నిర్మించడం, దానికి రెండుప్రక్కల మట్టికట్టలు వేయడం కుడివైపున సుమారు 3 మైళ్ళ పొడవున కాలువ త్రవ్వడం ఈ పథకం కార్యక్రమం. మొదటి ప్రణాళికలో పని పూర్తయింది.

రెండవ ప్రణాళికలో కొనసాగించబడిన ఈ పనులకు ఆ ప్రణాళికా కాలంలో రూ. 17.34 లక్షల వ్యయం జరిగింది. మూడవ ప్రణాళిక కేటాయింపు రూ. 1.34 లక్షలు. వ్యయం అంచనా రూ. 32.55 లక్షలు.

## కె. సి. కాలువ అభివృద్ధి

ఈ పథకం క్రింద తుంగభద్రా నదికి అడ్డంగా సుంకేసుల వద్దగల ప్రస్తుత ఆనకట్టను, మూడు అడుగుల ఫాలింగ్ షట్టర్లను స్థాపించడంద్వారానూ, ఆనకట్టను పటిష్ఠం చేయడంద్వారానూ అభివృద్ధి పరచడానికి ప్రతిపాదించారు. కాలువను మొదటి 74 మైళ్ళవరకు వెడల్పు చేయడాన్ని, లోతును తొమ్మిది అడుగులవరకు పెంచడాన్ని కాంక్రీటుతో లైనింగ్ చేయడాన్ని కూడా ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఇదే వ్యయం అంచనాక్రింద కాలువను 74/6వ మైలు నుంచి 190/0వ మైలు వరకు రూ. రెండు కోట్ల ఖర్చుతో అభివృద్ధి పరచడానికి కూడా ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. కాలువ అభివృద్ధిపని ముగిసింది. ఇప్పటివరకు 2,78,000 ఎకరాల ఆయకట్టును అభివృద్ధిపరచడం జరిగింది.

రెండవ ప్రణాళికలో కొనసాగింపబడిన ఈ పథకానికి ఆ ప్రణాళికలో రూ. 426.58 లక్షలు కేటాయించారు. ఈ కేటాయింపులో నుంచి రూ 419.26 లక్షల వ్యయం జరిగింది మూడవ ప్రణాళిక కేటాయింపు రూ. 133.5 లక్షలు. ఖర్చు అంచనా 757.24 లక్షలు.

## తొర్రిగడ్డ పంపింగ్ పథకం

రెండవ పంచవర్ష ప్రణాళికకు చెందిన ఈ పథకంక్రింద తూర్పు గోదావరిజిల్లాలో తొర్రిగడ్డ ప్రాంతంలోని భూములను గోదావరి నదినుంచి నీటిని తోడిపోయడంద్వారా నీటిపారుదల చేయడానికి తలపెట్టారు. పథకం మేరకు ఒక పంప్ హౌజ్ నెలకొల్పుతారు. ప్రధాన కాలువ పంప్ హౌజ్ నుంచి రెండు మైళ్ళవరకు సాగి రెండు శాఖలుగా చీలుతుంది. రెండవ కాలువ 18½ మైళ్ళవరకు ప్రవహించి తొర్రిగడ్డలో కలుస్తుంది. మొదటి కాలువక్రింద 9,400 ఎకరాలకు, రెండవ కాలువక్రింద 6,000 ఎకరాలకు నీటి పారుదల జరుగుతుంది. ఈ భూములను నీటిపారుదల చేయడానికి 175 క్యూసెక్కుల నీటివిడుదల అవసరం. ఈ పనులన్నీ పూర్తయ్యాయి. 1964 జనవరిలో పథకానికి ప్రారంభోత్సవం జరిగింది. 1964 జూలై మొదటి వారంలో నీరు వదిలారు. 5,000 ఎకరాల ఆయకట్టును సర్వరిచారు. 3,100 ఎకరాలను అభివృద్ధిపరచారు. రెండవ ప్రణాళికాకాలంలో ఈ పథకానికి రూ. 13.08 లక్షలు ఖర్చు చేశారు. మూడవ ప్రణాళిక కేటాయింపు రూ. 44.53 లక్షలు. వ్యయం అంచనా రూ. 47.39 లక్షలు.

### పైడిగం ప్రాజెక్టు

శ్రీకాకుళం జిల్లాలోని భాటలాపురం గ్రామానికి మూడు ఫర్లాంగుల ఎగువన మహేంద్రతనయ నదిమీద ఆనకట్టనొకదానిని, దాని ఎడమ పార్శ్వంలో సుమారు 9 మైళ్ళకాలువను ఒకదానిని నిర్మించడం యీ పథకం వుద్దేశం. వర్షాల మీద ఆధారపడే యాభై చెరువులకు ఈ కాలువవల్ల నీరు అందుతుంది. 1959 మే నెలలో పనిప్రారంభించారు. కొన్ని డ్రైనేజి పనులు మినహా మిగతా పనంతా పూర్తయ్యింది. దీనివల్ల 1965–66 సంవత్సరాంతానికి 4, 950 ఎకరాలకు సేద్యపునీటి సౌకర్యం కలుగుతుంది.

ద్వితీయ ప్రణాళికలలో దీనిక్రింద రూ. 4.34 లక్షలు ఖర్చయ్యాయి. తృతీయ ప్రణాళికలో దీనికి రూ. 15.94 లక్షలు కేటాయించారు. మొత్తం రూ. 24.13 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

### దెంకాడ ఆనకట్ట పథకం

విశాఖపట్టణం జిల్లాలోగల చంపావతి నదిమీద డెంకాడ వద్దప్రస్తుతంవున్న ఆనకట్టకు దిగువ కొద్దిదూరంలో ఒక ఆనకట్టను నిర్మించడం యీ పథకం కార్యక్రమం. 1959 ఏప్రెల్ లో దీనిని ప్రారంభిచారు. ద్వితీయ ప్రణాళికలో మరికొంత నిర్మాణపుపని మిగిలిపోగా దానిని తృతీయ ప్రణాళికలో పూర్తిచేయాలని ఉద్దేశించారు. ద్వితీయ ప్రణాళికలో దీనికింద్ర రూ. 12 లక్షలు ఖర్చుపెట్టారు. తృతీయ ప్రణాళికలో రూ. 10.79 లక్షలు కేటాయించారు. దీనికి మొత్తం ఖర్చు రూ. 26 లక్షలు అవుతుందని అంచనా.

### వరాహ రిజర్వాయరు పథకం

వర్షాలపై ఆధారపడిన చెరువులక్రింద ప్రస్తుత సాగవుతున్న ఆయకట్టుకు నీటిని అందించడంతోపాటు అదనంగా 2000 ఎకరాలకు సేద్యపునీటి సౌకర్యాన్ని కలిగించే విధంగా విశాఖపట్టణం జిల్లాలోని కళ్యాణపుల్వవద్ద వరాహానదిమీద రిజర్వాయరను ఒక దానిని నిర్మించడం యీ పథకం ఉద్దేశం. ద్వితీయ ప్రణాళికలో దీనిమీద రూ. 0.71 లక్షలు వెచ్చించారు. తృతీయ ప్రణాళికలో రూ. 5.09 లక్షలు కేటాయించారు. పథకానికి ప్రణాళికా సంఘం సాంకేతిక అనుమతిలభించింది. కేంప్ కాలనీ భవనాలు తదితర ప్రాథమిక పనులు కొనసాగుతున్నాయి. దీనికి రూ 38 లక్షల వ్యయం అవుతుందని అంచనా.

### తాండవ రిజర్వాయరు పథకం

విశాఖజిల్లాలో గంటవారి కొత్తగూడెం వద్ద తాండవ నదిమీద ఒక రిజర్వాయరుని నిర్మించడం యీ పథకం ఉద్దేశం. దానికి ఎడమవైపున 8 మైళ్ళపొడవు కాలువ, కుడివైపున 10 మైళ్ళపొడవు కాలువలను నిర్మించాలనికూడా ఉద్దేశించారు.

కేంప్ కాలనీ భవనాలు, రోడ్లు, నీటి సౌకర్యాల వంటి ప్రాథమిక పనులు పూర్తయ్యాయి. ద్వితీయ ప్రణాళిక చివరలో ప్రారంభించ బడింది. తృతీయ ప్రణాళికలో దీన్ని పూర్తిచేయాలని ఉద్దేశించారు. ద్వితీయ ప్రణాళికలో దీని మీద రూ. 8.85 లక్షలు ఖర్చయింది. నిజానికి ప్రణాళికా కేటాయింపు రూ. 5 లక్షలు మాత్రమే. తృతీయ ప్రణాళికలో రూ. 3.68 లక్షలు కేటాయించారు. దీనికి మొత్తం రూ. 199.40 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

## పాలేరు బిట్రగుంట సరఫరా కాలువ

నెల్లూరు జిల్లాలోని కందుకూరుకు ఉత్తరంగా ఆరు మైళ్ళ దూరంలో జిల్లెలమూడివద్ద పాలేరు నదిమీద రాతి ఆనకట్ట ఒకదానిని నిర్మించడం ; బిట్రగుంట చెరువుకు, దానిదిగువన మరొక నాలుగు చెరువులకు నీటిని అందించేందుకు ఆనకట్ట కుడి పార్శ్వంలో 8½ మైళ్ళ పొడవుగల సరఫరా కాలువను నిర్మించడం యీపథకం ఉద్దేశం. కొన్ని చిన్న చిన్న పనులు మినహా మిగిలిన పనంతా పూర్తయ్యింది. దీనివల్ల 5,500 ఎకరాలకు సేద్యపునీరు అందుతున్నది. ద్వితీయ ప్రణాళికలో రూ. 16.29 లక్షలు వెచ్చించారు. తృతీయ ప్రణాళికలో దీనికి రూ. 6.72 లక్షలు కేటాయించారు. దీనికి మొత్తం రూ. 24.81 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

## స్వర్ణముఖి ఎడమ కాలువ పథకం

చిత్తూరు జిల్లాలో 9 చెరువులకు నీటిని అందించే విధంగానూ, పాలచూరు, బుమవరం, పెన్నపల్లి కాలువలకుకూడా నీటిని అందించేవిధంగానూ చిత్తూరు జిల్లాలోని కాళహస్తివద్ద స్వర్ణముఖి ఆనకట్టవద్ద నుండి ఒక కాలువను త్రవ్వడం ఈ పథకం ప్రధానోద్దేశం. దీనిక్రింద సాగుకువచ్చే ఆయకట్టు 8,000 ఎకరాలు వుంటుందని అంచనా. అంటే ప్రస్తుతంవున్న 7,300 ఎకరాల ఆయకట్టుకూడా దీనిలోనే కలిసివుంది. ద్వితీయ ప్రణాళికలో దీనిక్రింద రూ. 0.03 లక్షలు ఖర్చుచేశారు. తృతీయ ప్రణాళిక కేటాయింపు రూ. 0.20 లక్షలు. దీనికి మొత్తం రూ. 29 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

అయితే యీ పథకాన్ని భారీ మధ్యతరహా నీటి పారుదల పథకంగాగాక చిన్నతరహా నీటి పారుదల పథకంగా చేపట్టడం జరిగింది.

## జుర్రేరు రిజర్వాయరు పథకం

ప్రస్తుతం ఆయకట్టు 50 ఎకరాలకు మరింత అధికంగా సాగు నీటి సౌకర్యాన్ని కల్పించడంతోపాటు మెట్టభూమిలో 1,450 ఎకరాలకు తొలి పంటకు, 500 ఎకరాలకు రెండో పంటకు సేద్యపు నీటిని అందించే విధంగా 217 M. ఘనపు

ఉదుగుల నీటితో కర్నూలు జిల్లాలోని జుర్రేరుపై ఒక రిజర్వాయరును నిర్మించడం దీని ఉద్దేశం. నిర్మాణపు పని పూర్తయ్యింది. నీటినికూడా విడుదలచేయడం జరిగింది. మొత్తం అభివృద్ధి పరచవలసిన ఆయకట్టు 1,800 ఎకరాలు కాగా యింతవరకు 800 ఎకరాల ఆయకట్టును అభివృద్ధి పరచడం జరిగింది. ఈ పథకానికి తృతీయ ప్రణాళికలో రూ. 12.49 లక్షలు కేటాయించారు. దీనికి మొత్తం రూ. 24.15 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

## కనుపూరు కాలువ పథకం :

పెన్నానదికి కుడివైపున సంగం ఆనకట్టవరకు నెల్లూరు జిల్లాలో ఒక కాలువను త్రవ్వడం యీ పథకం ఉద్దేశం. ఈ కాలువకు ఒక ప్రధాన తూమును ఏర్పాటుచేసి, దానిద్వారా 1,400 క్యూసెక్కుల నీరు విడుదల అయ్యేవిధంగా దీనిని నిర్మిస్తారు. దీనివల్ల నెల్లూరు, రాపూరు తాలూకాలలో 91 చెరువులక్రింద 17,935 ఎకరాల ఆయకట్టుకు సేద్యపునీటి సౌకర్యము కలుగుతుంది. అడ్డంగావేసే రాతికట్టపని, కాలువ మొదటి ఏడుమైళ్ళ త్రవ్వకం పని చురుకుగా సాగుతున్నది. తృతీయ ప్రణాళికలో దీనికి రూ. 44.29 లక్షలు కేటాయించారు. మొత్తంమీద దీనికి రూ. 213 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

# తెలంగాణా ప్రాంతం

### మూసీ ప్రాజెక్టు :

మూసీనదిమీద నల్గొండ జిల్లాలో ఒక రిజర్వాయరునూ, దానికి యిరుపార్శ్వాలలో రెండు కాలువలను నిర్మించడం ఈ ప్రాజెక్టు ప్రధాన ఉద్దేశం. దీనిని 1954లో ప్రారంభించారు.



మూసీ ప్రాజెక్టు

గట్లకు రక్షణగా తీసుకునే కొన్ని చర్యలుతప్ప మిగతాపనంతా పూర్తయ్యింది. 1960 మార్చి మాసాంతానికి 33 057 ఎకరాల ఆయకట్టును అభివృద్ధిపరచడం జరిగింది.

ద్వితీయ ప్రణాళికలో దీనిమీద రూ. 204.97 లక్షలు ఖర్చయ్యింది. నిజానికి ద్వితీయ ప్రణాళిక కేటాయింపు రూ. 152.83 లక్షలు మాత్రమే. తృతీయ ప్రణాళికలో రూ. 94.37 లక్షలు కేటాయించారు. దీనికి మొత్తం రూ. 282 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

### కోయిల్‌సాగర్ ప్రాజెక్టు :

దీనిని తొలిప్రణాళికలో ప్రారంభించారు. మహబూబ్ నగర్ జిల్లాలోని కోయిల్‌కొండ గ్రామంవద్ద పెద్ద వాగుమీద రిజర్వాయరును నిర్మించడం యీ ప్రాజెక్టులోని ప్రధానాంశం.

తొలి ప్రణాళికా కాలంలోనే యిది పూర్తయ్యింది. ద్వితీయ ప్రణాళికాంతానికి దీనిమీద రూ. 91.08 లక్షలు ఖర్చయ్యింది. తృతీయ ప్రణాళికలో రూ. 0.28 లక్షలు కేటాయించిరి. మొత్తంమీద దీనికి రూ. 91.27 లక్షల ఖర్చు వుంటుందని అంచనా.

### భీమనపల్లి ప్రాజెక్టు :

నల్గొండజిల్లాలో పెద్దవాగుశాఖ ఒకదానిమీద దెబ్బతిన్న కట్టను బాగుచేయడం యీ పథకం ఉద్దేశం. రూ. 8.98 లక్షల వ్యయంతో ఈ చెరువును పునర్వ్యవస్థీకరించాలని ఉద్దేశించ బడింది. ఈ ప్రాజెక్టు 1950లో తొలి పంచవర్ష ప్రణాళికలో చేపట్టి పూర్తిచేయడం జరిగింది. వ్యవసాయపు పనులనిమిత్తం నీటినికూడా విడుదలచేయడం జరిగింది. ద్వితీయ ప్రణాళికాంతానికి దీనిమీద రూ. 1.78 లక్షలు ఖర్చయ్యాయి. మొత్తం ఖర్చు అంచనా రూ. 9 లక్షలు.

### సరళాసాగర్ ప్రాజెక్టు :

కృష్ణానదికి ఉపనదిఅయిన చిన్న వాగుమీద స్టోరేజి రిజర్వాయరుని నిర్మించడం ఈ ప్రాజెక్టు ఉద్దేశం. వనపర్తి తాలూకాలో వనపర్తిరోడ్డు రైల్వే స్టేషనుకు నాలుగుమైళ్ళ దూరంలో యీ ప్రాజెక్టు స్థలంవుంది. 1947లో దీని నిర్మాణ కార్యక్రమం ప్రారంభించబడింది. నిర్మాణం పూర్తయిన తర్వాత నీటినికూడా విడుదలచేయడం జరిగింది. సంస్థానాలు రద్దు కాకముందు రాజా రామేశ్వరరావు దీనిని ప్రారంభించారు. ఆయన తల్లిగారైన రాణీ సరళాదేవి పేరే ఈ ఆనకట్టకుపెట్టడం జరిగింది.



సరళా సాగర్ ప్రాజెక్టు

తొలి ప్రణాళికలో అసంపూర్తిగా వదిలివేయబడిన యీ ఆనకట్ట నిర్మాణానికి ద్వితీయ ప్రణాళికలో రూ. 16.53 లక్షలు ఖర్చుపెట్ట బడ్డాయి. తృతీయ ప్రణాళికలో దీనికి గాను రూ. 0.89 లక్షలు కేటాయించ బడ్డాయి. ఈ ఆనకట్ట నిర్మాణానికి మొత్తం అయిన ఖర్చు రూ. 35.54 లక్షలు.

## జూట్‌పల్లి ప్రాజెక్టు:

హైదరాబాదు జిల్లా, తాండూరు తాలూకాలో జూట్‌పల్లి గ్రామంవద్ద ఒక రిజర్వాయరుని నిర్మించడం ఈ ప్రాజెక్టు ప్రధానోద్దేశం. మట్టి కట్టపనులు పూర్తయ్యాయి. ఇతర పనులు చురుకుగా సాగుతున్నాయి.

ప్రణాళికా కాలంలో దీనిమీద రూ. 2.80 లక్షలు వెచ్చించడం జరిగింది. దీనికి మొత్తం రూ. 17.48 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

## లక్నాపూర్ ప్రాజెక్టు :

హైదరాబాదు జిల్లా, పర్గి తాలూకా, లక్నాపూర్ గ్రామం వద్ద ఒక స్టోరేజి రిజర్వాయరును నిర్మించడం దీని ప్రధానోద్దేశం. దీనికి రూ. 19.85 లక్షలు ఖర్చవుతుందని తద్వారా 2,600 ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యం కల్పించ బడుతుందని అంచనా. ద్వితీయ ప్రణాళికలో దీనిమీద రూ. 0.02 లక్షలు వెచ్చించడం జరిగింది. కాలువ నిర్మాణపు పనులు, కేంప్ భవనాల పనులు చురుకుగా సాగుతున్నాయి. తృతీయ ప్రణాళికలో దీనికి రూ. 19.35 లక్షలు కేటాయించ బడ్డాయి. దీనికి మొత్తం ఖర్చు రూ. 19.85 లక్షలు అవుతుందని అంచనా.

## స్వర్ణ ప్రాజెక్టు :

7,000 అడుగుల పొడవు 60 అడుగుల ఎత్తుగల మట్టి ఆనకట్టను నిర్మించి, దానికి రెగ్యులేటర్‌ను అమర్చడం, అటూ, యిటూ రెండు కాలువలను నిర్మించడం ఈ ప్రాజెక్టు నిర్మాణంలోని ముఖ్యాంశం. ఎడమ పార్శ్వంలోని తూముల నిర్మాణం పూర్తయ్యింది. తదితర పనులు చురుకుగా సాగుతున్నాయి. దీనికి తృతీయ ప్రణాళిక కేటాయింపు రూ. 21 లక్షలు. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి మొత్తం రూ. 51 లక్షలు అవుతుందని అంచనా.

## సాలివాగు ప్రాజెక్టు :

వరంగల్లు జిల్లా, పరకాల తాలూకాలోని సాలివాగు నదీగర్భంలో 7020 అ, పొడవు, 45 అ. ఎత్తుగల మట్టిఆనకట్టను నిర్మించడం యీ పథకం ప్రధానోద్దేశం. ప్రాజెక్టు పని యించు మించు పూర్తయ్యింది. 1964లో ఎడమ పార్శ్వంలో 532 ఎకరాలు, కుడి పార్శ్వంలో 389 ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యాన్ని కల్పించడం జరిగింది. దీనికి మొత్తం రూ. 31.20 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

# చతుర్థ ప్రణాళిక

# అధికాహారోత్పత్తి కృషి

## వ్యవసాయ రంగంలో విస్తృత ప్రగతి

ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయం ప్రధాన వృత్తిగాగల రాష్ట్రం. ఈ రాష్ట్రంలో డెబ్బయి శాతానికి పైగా ప్రజలు వ్యవసాయం మీద ఆధారపడి వున్నారు. రాష్ట్రం ఆదాయంలో సగానికి సగం వ్యవసాయం నుంచే లభిస్తున్నది.

## సేద్యపు వివరాలు

ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 1.06 లక్షల చదరపు మైళ్ళు (6,78,92,796 ఎకరాలు). అంటే భారతదేశం విస్తీర్ణంలో 8.4 శాతం అన్నమాట. రాష్ట్రంలో నికర సాగుభూమి సుమారు 2,81,84,235 ఎకరాలు వుంటుంది. ఇది మొత్తం రాష్ట్ర విస్తీర్ణంలో 41 శాతం. 1961లో భారత దేశంలో తలసరి సాగు భూమి ఒక ఎకరం కాగా రాష్ట్రంలో తలసరిసాగు భూమి 1.09 ఎకరాలు వుంది. రాష్ట్రంలోని నికర సాగుభూమి 2,81,34,425 ఎకరాలలోనూ 79.5 శాతం ఆహార ధాన్యాలకు, 12.9 శాతం నూనె గింజలకు, 3.3 శాతం ప్రత్తికి, మిగిలిన భూమి తదితర పంటలకు ఉపయోగించ బడుతున్నది. 1963-64 కాలంలో 72,52,897 ఎకరాలకు నికరంగా సేద్యపునీరు లభించింది. అంటే నికర సాగుభూమిలో 36.8 శాతం భూమికి సేద్యపునీరు లభించిందన్నమాట. అసలు రాష్ట్రంలో సాగవుతున్న మొత్తం భూమి 3,15,10,362 ఎకరాలు. దీనిలో 33,26,127 ఎకరాల్ని ఒకటికన్న ఎక్కువ సార్లు సాగుచేస్తున్నారు. రాష్ట్రంలో, సేద్యపు నీరు అందజేయ బడుతున్న మొత్తంభూమి 90,54,738 ఎకరాలు వుంది.

## సాగునీటి వనరులు

ప్రభుత్వపు కాలువల ద్వారానూ, ప్రయివేటు వ్యక్తుల కాలువల ద్వారానూ 32,40,838 ఎకరాలకు, చెరువుల ద్వారా 30,30,730 ఎకరాలకు, బావులద్వారా 9,79,959 ఎకరాలకు, తదితర వనరులద్వారా 4,01,369 ఎకరాలకు సేద్యపునీటి సౌకర్యం కల్పించబడుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో సాగునీటి అభివృద్ధి ప్రధానంగా కృష్ణా, గోదావరీ నదీ పరీవాహ ప్రాంతాలలోనే జరిగింది. రాష్ట్ర విస్తీర్ణంలో సగం కృష్ణా, గోదావరీ పరీవాహ ప్రాంతంగానే పరిగణించవచ్చు. అసలు రాష్ట్రంలో సాగవుతున్న భూమిలో 71 శాతానికి కృష్ణా, గోదావరి బేసిన్ జలాలే అందుతున్నాయి.

రాష్ట్రంలో సాగవుతున్న భూమిలో 36 శాతం ప్రాంతానికి సేద్యపు నీటి సౌకర్యాలు కల్పించబడుతున్నప్పటికీ, మన వ్యవసాయదారులు తెలివైనవారైనప్పటికీ మన రాష్ట్రంలో వ్యవసాయంలో తలసరి దిగుబడి మద్రాసు, కేరళ, అస్సాం, పశ్చిమ బెంగాల్‌వంటి రాష్ట్రాలతో పోల్చి చూస్తే చాల తక్కువే అని చెప్పవచ్చు. మన రాష్ట్రంలోని సాగు భూమిలో ఎక్కువమేరకు ఆహారపు పంటల్ని పండించడానికి ఉపయోగిస్తున్నాం. ఇదే తలసరి దిగుబడి తగ్గడానికి ప్రధాన కారణం. ఇతర రాష్ట్రాలలో అయితే సాగు భూమిలో ఎక్కువ మేర జనుము, చెరకువంటి పరిశ్రమలకు అవసరమైన పంటల్ని పండిస్తున్నారు. సాధారణ పరిస్థితుల్లో ఈ రాష్ట్రం ఆహారధాన్యాలలో స్వయం సమృద్ధంగానే వుంటుంది. అంటే ఏటా 6 నుండి 8 లక్షల టన్నుల్ని ఉత్పత్తి చేస్తుంది. 12 లక్షల టన్నుల చెరకుగడను కూడ ఉత్పత్తిచేస్తుంది.

## పంటల వివరాలు

సాగునీటి సౌకర్యంగల మొత్తం ప్రాంతంలో 60 శాతానికి పైగా వరి పండించబడుతున్నది. మిగిలిన 40 శాతం ప్రాంతంలోనూ రాగి, మిరప, అరటి పండ్లు తదితర పంటలు పండించబడుతున్నాయి. మెట్టపంటల్లో 50 శాతం కాయ ధాన్యాలే ఆక్రమిస్తున్నాయి. కాయ ధాన్యాల్లో కూడా సగానికి సగం జొన్న పంటే ఆక్రమిస్తున్నది.

కొన్ని ముఖ్యపంటల విషయంలో భారత దేశంలో సగటున ఎకరానికి వచ్చేపంట దిగుబడిని రాష్ట్రంలోని దిగుబడితో పోల్చి యీదిగువ చూపించడం జరిగింది. ఈ పట్టికను పరిశీలించి చూస్తే ఒక విషయం స్పష్టంకాకమానదు. ఎకరాకు సగటు భారతదేశం దిగుబడికన్న రాష్ట్రం దిగుబడి కొన్ని అతి ముఖ్యమైన పంటల విషయంలో ఎక్కువే అనేవిషయం స్పష్టపడుతుంది.

| | | భారతదేశం (1963-64) (పౌనుల్లో) | ఆంధ్రప్రదేశ్ (పౌనుల్లో) |
|---|---|---|---|
| 1. | ధాన్యం | 896 | 1154 |
| 2. | జొన్న | 448 | 478 |
| 3. | చెరకు | 4133 Gur | 7769 Gur |
| 4. | వేరుశెనగ | 672 | 680 |
| 5. | పప్పు ధాన్యాలు | 371 | 197 |
| 6. | ప్రత్తి | 110 (lint) | 51 (lint) |

## అధిక వ్యవసాయోత్పత్తికి ఆధారాలు

పంటల దిగుబడిని పెంచాలంటే సేద్యపునీరు, పుష్టికరమైన విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులు, ఋణాలు— ఈ సౌకర్యాలు ప్రధానంగా కావాలి. వీటి అన్నిటిలోనూ ఎకరాకు పంటదిగుబడిని పెంచడంలో ఎరువులు ప్రధాన పాత్రవహిస్తాయి. ఎకరాకు 20 పౌ. చొప్పున వేయగా 1 టన్ను నత్రజనివల్ల అదనంగా 10.4 టన్నుల ధాన్యం, 19.4 టన్నుల మొక్కజొన్న, 1.2 టన్నుల సేద్యపుసౌకర్యంతో వేరుశెనగ లభిస్తాయి. అదే విధంగా ఎకరాకు 20 పౌ. చొప్పున ఒక టన్ను $P_2O_5$ వేయడంవల్ల 6.7 టన్నులు ధాన్యం 15.7 టన్నులు మొక్కజొన్న, 7.03 టన్నులు సేద్యపు సౌకర్యంతో వేరుశెనగ అదనంగా దిగుబడి అవుతాయి. వ్యవసాయోత్పత్తిని సాధ్యమైనంత ఎక్కువచేసే ఉద్దేశంతో అన్ని ప్రణాళికల్లోనూ ఎరువుల వినియోగానికి అధిక ప్రాధాన్యం యివ్వడం జరిగింది. చతుర్థ పంచవర్ష ప్రణాళిక కాలంలో అదనంగా ఉత్పత్తి చేయాలని ఉద్దేశించిన 40.48 లక్షల టన్నుల ఆహారధాన్యాలలోనూ 50 శాతానికిపైగా రసాయనిక ఎరువుల వినియోగం ద్వారా సాధించాలని ఉద్దేశించబడినది.

## ప్రణాళికా కాలంలో ఆహారోత్పత్తి స్థితిగతులు

యావద్భారతంలోనూ ఆహారధాన్యాల ఉత్పత్తిస్థాయి గత పద్నాలుగేళ్ళ ప్రణాళికా కాలంలో 75 శాతం పెరిగింది. 1950-51 లో దేశంలో ఆహారధాన్యాల ఉత్పత్తిస్థాయి 5 కోట్ల టన్నులు కాగా 1964-65 లో 8.8 కోట్లు టన్నులువుంది. ఆంధ్ర ప్రదేశ్‌లో 1950-51లో ఉత్పత్తి 40.1 లక్షల టన్నులు. అంటే ప్రణాళికలు ఆరంభమయ్యేసరికి రాష్ట్రంలో ఉత్పత్తిస్థాయి 40.1 లక్షలు టన్నులు వున్నదన్నమాట. ద్వితీయ పంచవర్ష ప్రణాళికాంతానికి ఈ ఉత్పత్తి 63.19 లక్షల టన్నులకు పెరిగింది. తృతీయ ప్రణాళికాంతానికి ఇది 90.86 లక్షల టన్నులకు పెరుగుతుందని అంచనా. అంటే తృతీయ ప్రణాళికలో అదనంగా 27.67 లక్షల టన్నుల్ని ఉత్పత్తి చేయడం జరుగుతుంది. అయితే 1964-65 సంవత్సరాంతానికి 82.75 లక్షల టన్నుల్ని ఉత్పత్తి చేయగలిగాం. ప్రణాళికలు ఆరంభమైననాటి ఉత్పత్తితో పోల్చిచూస్తే నూటికి నూరుపాళ్ళు ఉత్పత్తిలో అభివృద్ధిని సాధించగలిగామని అర్థమౌతుంది. కాని, 1965-66లో క్షామ పరిస్థితులు ఏర్పడినందువల్ల ఆహారధాన్యాల ఉత్పత్తిలో యీ ఏడాది తీసికట్టు కనిపించింది. రాష్ట్రంలోనూ, రాష్ట్రంలోనేకాక యావత్‌దేశంలోనూ, ఆహారధాన్యాల ఉత్పత్తిలో ఎంతో అభివృద్ధిని సాధించగలిగినప్పటికీ యీ ఉత్పత్తి ప్రస్తుత జనాభాకు సరిపోదు. ప్రణాళికా కాలంలో దేశంలో జనాభా విపరీతంగా పెరిగింది. వివిధ అభివృద్ధి పథకాలను ప్రవేశపెట్టడం ద్వారా ప్రజల ఆదాయం మెరుగుపరిచబడింది. ప్రజల జీవన ప్రమాణం, జీవనస్థాయి పెరిగాయి. వీటికివీలుగా పౌష్టికాహార ప్రమాణలు నెలకొల్పబడ్డాయి. ఈ ప్రమాణాల మేరకు ప్రజలకు ఆహారాన్ని అందజేయాలంటే ప్రస్తుతం మనం పండిస్తున్న ఆహారధాన్యాలు చాలవు.

నూనెగింజలు, చెరకు, ప్రత్తివంటి వాణిజ్య పంటల ఉత్పత్తిని అధికంచేసే విషయానికికూడా ప్రణాళికల కాలంలో ఎక్కువ ప్రాధాన్యతను యివ్వడం జరిగింది. వ్యవసాయం ప్రాతిపదికగాగల పరిశ్రమలకు వీటివల్ల ముడిసరుకు లభిస్తుంది. ఆహారధాన్యాలు, వాణిజ్యపంటలలో తృతీయ ప్రణాళికలో సాధించిన ఉత్పత్తి వివరాలను యీ దిగువ చూడవచ్చు :—

| పంటపేరు | యూనిట్టు | 1960-61 ప్రాతిపదికస్థాయి | తృతీయ ప్రణాళికలో అదనపు ఉత్పత్తి | 1965-66 లో మొత్తంఉత్పత్తి | |
|---|---|---|---|---|---|
| | లక్షలు | టన్నులు | | | |
| ఆహారధాన్యాలు | .. | 63.19 | 27.67 | 90.86 | అంచనా |
| నూనెగింజలు | .. | 8.23 | 4.00 | 12.23 | .. |
| చెరకు (Gur) | .. | 6.23 | 1.18 | 7.41 | .. |
| ప్రత్తి (Lint) | .. | బేళ్ళు 1.15 | 0.85 | 2.00 | .. |

## చతుర్థప్రణాళికలో ఆహారోత్పత్తి స్వరూప స్వభావాలు

చతుర్థ పంచవర్ష ప్రణాళికాంతానికి 1250 లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఉత్పత్తి చేయగల స్థితికి చేరుకోవాలని భారత ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. అంటే మన అంచనా ప్రకారం తృతీయ ప్రణాళిక ముగిసేనాటికి మొత్తం దేశంలో ఉత్పత్తి స్థాయి 760 లక్షల టన్నులు అయితే చతుర్థ ప్రణాళికాంతానికి దీనిమీద అదనంగా 490 లక్షల టన్నులను ఉత్పత్తి చేయగలం అన్నమాట. దీనిని సాధించగలిగితే ఆహార పదార్థాల విషయంలో దేశం స్వయం సమృద్ధమైనట్టే. ఈ ప్రకారం అదనపు ఆహార ధాన్యాల ఉత్పత్తి విషయంలో ఆంధ్రప్రదేశ్ లక్ష్యం 40.48 లక్షల టన్నులు. చతుర్థ ప్రణాళికలో అదనంగా ఉత్పత్తి చేయవలసిన ఆహారధాన్యాలకై తీసుకోదలచిన చర్యలు, తద్వారా సాధించే అభివృద్ధి వివరాలు యీ దిగువ పొందు పరచబడినవి:—

| అభివృద్ధి కార్యక్రమం | యూనిట్లు | చతుర్థప్రణాళిక లక్ష్యం |
|---|---|---|
| 1. ఆహారధాన్యాలు: | | |
| i భారీ, మధ్యతరహా నీటి పారుదల సౌకర్యాలు | లక్షలు టన్నులు | 6.09 |
| ii చిన్ననీటి పారుదల సౌకర్యాలు | .. | 2.76 |
| iii భూసార పరిరక్షణతో సహా పంట భూమి అభివృద్ధి చర్యలు | .. | 1.47 |
| iv రసాయనిక ఎరువులు, పచ్చిఎరువులు | .. | 22.94 |
| v మేలురకం విత్తనాలు | .. | 1.93 |
| vi ఆధునిక వ్యవసాయ పనులు | .. | 5.28 |
| | | మొత్తం 40.48 |

ఎక్కువ దిగుబడిని యిచ్చే వరి, మొక్కజొన్న, సజ్జ, జొన్నలను అధికంగా వ్యాప్తిలోకి తీసుకు రావడమే యిటీవలి కాలంలోని పరిశోధనలు; విస్తరణ కార్య క్రమాల లక్ష్యం. భారతీయ రకాలు విదేశీయ వరి రకాలతోగాని హైబ్రిడ్ మొక్కజొన్న, హైబ్రిడ్ జొన్న, హైబ్రిడ్ సజ్జలతోగాని పోల్చిచూస్తే చాలా విషయాలలో తీసికట్టు కనిపిస్తుంది. ఎరువుల్ని వేసినప్పటికీ పైరకాలు యిచ్చినంత దిగుబడిని దేశవాళీ రకాలు యివ్వలేవు. అధిక దిగుబడిగల పై రకాలు మన దేశవాళీరకాలకన్నా మూడురెట్లు ఎక్కువ దిగుబడిని యిస్తాయి. దేశవాళీరకాలకు ఎరువులను గ్రహించే శక్తి కూడా తక్కువే. ఖరీఫ్ పంట కాలంలో ఈ రకాలు_ముఖ్యంగా డెల్టా జిల్లాలలోని రకాలు_20 నుంచి 40 పౌనుల నత్రజనిని మాత్రమే గ్రహించ గలవు. కాని తైచుంగ్ నేటివ్ 1, తైనాన్ 3, చైనాన్ 2, తైచుంగ్ 65 వంటి విదేశీ వరివంగడాలు 120 పౌనులవరకు నత్రజనిని గ్రహిస్తాయి. అదే విధంగా హైబ్రిడ్ జొన్న, హైబ్రిడ్ మొక్కజొన్న, హైబ్రిడ్ సజ్జ రకాలు కూడా 100 పౌనుల నత్రజని స్థాయినించికూడా పౌష్టికాహార పదార్థాలను గ్రహించ గలవు. ఇవన్నీ కూడా దేశవాళీ రకాలకన్న మూడు రెట్లు అధికంగా దిగుబడిని యిస్తాయి. అందువల్ల భారత ప్రభుత్వం ఒక కొత్త పద్ధతిని ఆలోచించింది. చతుర్థ పంచవర్ష ప్రణాళికాంతానికి 325 లక్షల ఎకరాలను అధిక దిగుబడినిచ్చే పంట రకాలకిందకు తీసుకురావాలని ఉద్దేశించింది. దీనివల్ల కనీసం 320 నుంచి 640 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా ఉత్పత్తి అవుతాయి. విదేశీయ వరి, గోధుమ రకాలను, హైబ్రిడ్ జొన్న, హైబ్రిడ్ సజ్జవంటి అధిక దిగుబడి నిచ్చే రకాలను పండించే విషయంలో ఎక్కువ కృషి జరుగుతున్నది. ఈ కార్యక్రమాన్ని జయప్రదంగా అమలు పరచడానికి అవసరమయ్యే సహాయాన్ని తగిన సమయంలో అందజేయడానికి వీలుగా ఒక ప్లానుకూడా రూపొందించ బడింది. 1970_71 సం. అంతానికి భారతదేశంలో అధిక దిగుబడి రకాల క్రిందకు తీసుకు రాదలచిన మొత్తం 325 లక్షల ఎకరాలలోనూ ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే 76.41 లక్షల ఎకరాలలో వరి, 50 లక్షల ఎకరాలలో హైబ్రిడ్ జొన్న, 2.2 లక్షల ఎకరాలలో హైబ్రిడ్ మొక్కజొన్న, 7.15 లక్షల ఎకరాలలో హైబ్రిడ్ సజ్జ పండించడం జరుగుతుంది. 1966_67 లో రాష్ట్రంలో 10.05 లక్షల ఎకరాలలో ఎక్కువ పంట దిగుబడినిచ్చే వరి, హైబ్రిడ్ జొన్న, హైబ్రిడ్ మొక్కజొన్న, హైబ్రిడ్ సజ్జ పంటలను పండించడానికి వీలుగా ఒక కార్యక్రమం రూపొందించబడింది కూడాను. దీని ప్రకారం తూర్పు గోదావరి జిల్లాలో చతుర్థ ప్రణాళికా కాలంలో 7.15 లక్షల ఎకరాలలో అధిక దిగుబడినిచ్చే వరిని, 40,000 ఎకరాలలో హైబ్రిడ్ జొన్నను, 38,000 ఎకరాలలో హైబ్రిడ్ సజ్జను పండించాలని ఉద్దేశించబడింది. 1966_67 సంవత్సరంలో 50,000 ఎకరాలలో అధిక దిగుబడి వరి వంగడాల్ని, 2,000 ఎకరాలలో హైబ్రిడ్ జొన్నను తూర్పు గోదావరి జిల్లాలో పండించాలనేది ఆ జిల్లాకు ఏర్పరచిన కేటాయింపు.

అధిక దిగుబడినిచ్చే పంగడాలను పండించడంలో, వాటిని బహుళ ప్రచారంలోకి తేవడంలో భారత ప్రభుత్వం కొత్తగా అనుసరిస్తున్న విధానాలవల్లా, ప్రస్తుతం ఉన్న వనరులను సక్రమంగా రైతులు వినియోగించుకోవడంవల్లా 1970_71 నాటికి 1250 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను పండించాలన్న మన లక్ష్యాన్ని సాధించడం ఏమంత కష్టంకాదు. అధిక దిగుబడి నిచ్చే రకాలను వ్యాప్తిలోకి తెచ్చే కార్యక్రమంతో బాటు అనేక తీవ్రతర కార్యక్రమాలను అమలుపరిచి తద్వారా మన రాష్ట్రం లక్ష్యంగా పెట్టుకున్న 40.48 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను పండించడంలో ఆంధ్రప్రదేశ్ ఎప్పుడూ వెనుకబడదు. 1965_66 లో ఏర్పడిన కరువు పరిస్థితులవల్ల ఆహార రంగంలో దేశాన్ని స్వయం సమృద్ధం చేయవలసిన అవసరాన్ని సర్వత్రా గుర్తించడం జరిగింది. ప్రస్తుతం మనదేశానికి విదేశాలనుంచి పెద్ద మొత్తాలలోనే ఆహార ధాన్యాలు దిగుమతి అవుతున్నాయి. చతుర్థ ప్రణాళికాంతానికి మనదేశం ఆహార రంగంలో స్వయం సమృద్ధమై పటిష్ఠవంతమైన వ్యవసాయ వ్యవస్థ ఏర్పడితేనే గాని లేకపోతే దేశంలో శీఘ్రతరమైన పారిశ్రామికీకరణకు తావుండదు. పైగా దేశంలోని వివిధ అభివృద్ధి పథకాలు కుంటుపడతాయి. దేశ ప్రగతిలో మాంద్యం ఏర్పడితే చిట్ట చివరకు దేశమే వెనకబడిపోతుంది. చతుర్థ పంచవర్ష ప్రణాళికలో అదనంగా 40.48 లక్షల ఆహార ధాన్యాల్ని మన రాష్ట్రం పండించాలని మనం లక్ష్యంగా ఏర్పరచుకున్నాం. ఈ గురుతరమైన కార్యక్రమాన్ని తూర్పు గోదావరి జిల్లా రైతులు సమర్థవంతంగా ఆచరిస్తారని, అపారమైన వనరులతో శోభిల్లుతున్న తూర్పుగోదావరి జిల్లా ప్రకృతి సంపదను వ్యవసాయదారులు లాభసాటిగా వుపయోగించుకుని మన లక్ష్య సాధనలో తమ వంతు పాత్రను వారు సమర్థనీయంగా, శ్లాఘనీయంగా నెరవేర్చగలరని భావిస్తున్నాను.



(సీరియల్)

# పంచతంత్రము

## ఒంటె-వాయసాదుల కథ

ఒకానొక అడవియందు 'మదోత్కటము' అను సింహము నివసించుచుండెను. దానికి పులి, కాకి, నక్క అనుచరులుగా నుండెను. ఒకప్పుడవి యన్నియు వనమునందు తిరుగాడుచుండగా 'కథనకుడు' అను నొక ఒంటె కనబడెను. దానిని చూచి:-

సింహము:- ఆహా! ఇదియొక అపూర్వమైన మృగముగదా! ఇది అడవి మృగమో లేక గ్రామ్య మృగమో కనుగొనుడు.

కాకి:- స్వామీ! ఇది ఒంటె అను పేరుగల ఒక గ్రామ్యమగు జంతువు. నీ ఆహారమునకు యోగ్యమైనది. సంహరింపుము.

సింహము:-నాయింటికి వచ్చిన శత్రువునైనను నేను చంపను. కనుక దీనికి అభయమిచ్చి నాకడకు తోడ్కొని రండు. అది ఇక్కడికి వచ్చిన కారణము అడిగెదను.

ఆ మాట ప్రకారము ఇతర మృగములన్నియు ఆ ఒంటెకు అభయమిచ్చి మదోత్కటము వద్దకు తోడ్కొని వచ్చెను. ఒంటె సింహమునకు నమస్కరించి కూర్చొనెను. ఆ సింహము అడుగగా తన వృత్తాంత మంతయు చెప్పెను. అది విని సింహము "మిత్రమా! ఇకపైన నీవు బరువులను మోసి గ్రామములో కష్టజీవితమును గడపవలసిన అవసరములేదు. ఇక్కడనే నా పరివారములో ఒకడవుగా నుండి సుఖముగా యథేచ్ఛగా తిరుగు చుండుము. మరకత మణులవంటి పచ్చికను మేయుచు ఎల్లప్పుడు నాతో నివసించుము." అని చెప్పెను. ఆమాటకు ఒంటె సంతసించి సుఖముగా భయము లేక వారిలో ఒకడుగా నుండెను. అంతట ఒకనాడు మదోత్కటమునకు ఒక మహా గజముతో యుద్ధము జరిగెను. అందులో రోకండ్లవంటి ఆ గజదంతముల దెబ్బలచే చాల బాధపడెను. కాని చావకుండా వికలాంగములతో పడియుండెను. శక్తిచాలక ఎక్కడికిని పోలేక ఉండెను. అప్పుడు ఇతర మృగములు ఆహారము తెచ్చుకొనుశక్తి చాలక ఆకలిచే బాధ పడుచుండెను. వాని కష్టమును చూచి భరించలేక సింహము ఇట్లనెను. "ఓయీ! ఎక్కడనైనను ఒక మృగమును వెతకి చూడుడు. నేను ఈ దురవస్థలో ఉన్నను దానిని చంపి మీకు భోజనము పెట్టెదను."

ఆ మాట ప్రకారమే ఆ నాలుగు మృగములు వనమంతయు తిరిగెను. కాని యెక్కడగూడ ఒక మృగము లభించలేదు. అప్పుడు కాకి, నక్క యీవిధముగా ఆలోచించెను:-

నక్క:- ఓయీ! కాకమా! ఈలాగు ఊరక తిరుగుటలో ప్రయోజనమేమి? మన ప్రభువుకు విశ్వాస పాత్రుడై నయీ "కథనకుడు" ఉండనే ఉన్నాడు. ఇతనిని చంపి ఆహారము సమకూర్చుకొందము.

కాకి:- మిత్రమా! మంచిమాట చెప్పితివి. కాని యితనిని చంపగూడదని మన ప్రభువు అభయ మిచ్చియుండెను గదా.

నక్క:- మిత్రమా! ప్రభువు ఇతనిని చంపుటకు అనుమతించునట్లు నేను యుక్తి పన్నెదను. మీరందరు ఇక్కడనే ఉండుడు. నేను ఇంటికి పోయి ప్రభువుయొక్క ఆజ్ఞ గైకొని వచ్చెదను.

అనిచెప్పి వెంటనే సింహము కడకు పోయి యిట్లనెను:-

"స్వామీ! వనమంతయు తిరిగి చూచితిమి. ఒక్కమృగము కూడ దొరకలేదు. మేము ఆకలిబాధచేత ఒక్క అడుగైనను నడవలేకున్నాము. మీరును పథ్యము పుచ్చుకోవలసియున్నది కదా! కనుక ప్రభువాజ్ఞ అయినచో కథనకుని మాంసముతో మనము ఆహార క్రియనెరవేర్చు కొందుముగాక"

ఆమాటవిని సింహము కోపముతో "ఛీ! పాపిష్ఠుడా. మరి యొకమారు ఈ మాట పలికినచో వెంటనే నిన్ను వధించెదను. ఒంటెకు నేను అభయమిచ్చితిని. ఎట్లుదానిని చంపవచ్చును? అన్నిటికన్న అభయప్రదానము చాలగొప్పదిగదా!" అని అనెను.

అదివిని నక్క ఇట్లనెను. "స్వామీ! అభయమిచ్చి చంపినయెడల దోషమని తలచు చున్నారుగదా! ఒకవేళ ఒంటెయే స్వయముగా భక్తితోవచ్చి మీ ఆహారార్థమై చంపుమనినచో దోషములేదుగదా! అట్లైనచో దానిని చంపుడు. అదికూడ కాదందురేని, మీ ఆకలి బాధనుచూచి మేము సహించలేకున్నాము. మాలోనొకరినైన చంపి తక్కిన వారికి మీతోపాటు ఆహారము పెట్టుడు. ప్రభువుకొరకు ఉపయోగించని ఈ ప్రాణములతో మాకు పనియేమి? తమకు ఆకలిచే ప్రాణాపాయము సంభవించినచో ఆ తరువాతనైనను మేమందరము అగ్ని ప్రవేశము చేసి ప్రాణములను విడువవలసిన వారమేకదా! కనుక నామనవి చిత్తగింపుడు"

ఆ మాటవిని మదోత్కటము:- "అలాగైనచో మీయిష్టము ప్రకారము చేయుడు" అనెను. అంతట ఆ నక్క వెంటనేపోయి తన సహచరులతో ఇట్లనెను:- "ఓయీ! మన ప్రభువునకు మిక్కిలి దురవస్థ కలిగినది. మీరు ఈలాగు హాయిగా తిరుగుచున్నారు. ప్రభువు లేకున్నచో మనకు దిక్కెవరు? కనుక మనము అతనివద్దకు పోవుదము. అతడు ఆకలి బాధచే పరలోకమునకు పోవుటకు పూర్వమే అతనికి ఆహారముగా మన శరీరమును అర్పింతము. ఋణమును తీర్చుకొందము."

అది విని ఆ జంతువులన్నియు సింహము కడకు పోయి దుఃఖించుచు కూర్చొనెను. వానిని చూచి సింహము ఇట్లనెను:- "ఓయీ! మీకేదైన మృగము లభించెనా?"

ఆ మాటకు కాకి "స్వామీ! మేము వనమంతయు తిరిగితిమి. కాని ఒక్క మృగముగూడా లభించలేదు. కనుక ఇప్పుడు నన్ను భక్షించి మీ ప్రాణములను కాపాడుకొనుడు. దాని వలన మీకు తృప్తి, నాకు స్వర్గప్రాప్తి కలుగును;" అని అనెను.

ఆ మాటకు నక్క అడ్డువచ్చి యిట్లనెను:– "నీది చిన్న శరీరము. నిన్ను తినుటవలన ప్రభువుకు ఆకలి తీరదు. ఇంతియే గాక కాకి మాంసము తినుటవలన ఆయనకు దోషముగూడ సంభవించును. నీవు స్వామిభక్తిని చూపితివి. ఋణ విముక్తుడవైతివి. ఉభయ లోకములందును కీర్తి, పుణ్యము సంపాదించితివి. చాలును. నేను స్వామిని వేడుకుందును." అని "స్వామీ! నన్ను భక్షించి నాకు ఉభయ లోకములలో శుభమును చేకూర్చుడు" అని చెప్పెను.

ఆ తరువాత పులి యిట్లనెను:– "ఓయీ! నక్కా నీవు మంచి మాటనే చెప్పితివి. కాని నీ శరీరముచూడ చిన్నదే. దీనిచే ప్రభువు ఆకలి తీరదు. ఇదిగాక. నీవు ప్రభువునకు స్వజాతివాడవు. ఆయన 'నఖాయుధుడు నీవును నఖాయుధుడవే' (గోళ్లు ఆయుధముగా గల జంతువు) కనుక నిన్ను తినుట దోషము. నేనే స్వామికి ఆహారమయ్యెదను. ఇట్లు స్వామి ఋణము తీర్చుకొని యీ లోకములో కీర్తి, "పరలోకములో శాశ్వత సుఖమును అనుభవించెదను" అని చెప్పి సింహముతో "తనను భక్షించి ఆకలి తీర్చుకొనుము" అని వేడుకొనెను.

ఈ మాటలన్నియు వినుచు ఒంటె యిట్లు చింతించెను:– "వీరందరును మంచిమాటలే చెప్పిరి. కాని ఒక్కరినిగూడ ప్రభువు చంపలేదు. కనుక నేనుగూడ ఈ సమయమునకు తోచినట్లు మాట్లాడెదను. అంతగా మించి వచ్చినప్పుడు ఈ ముగ్గురు నన్ను కాపాడక మానరు.'' అని నిశ్చయించు కొని యిట్లనెను :– "ఓయీ ! వ్యాఘ్రమా ! నీవును సత్యమే చెప్పితివి. కాని నీవు గూడ నఖాయుధుడవే. కనుక స్వజాతివైన నిన్ను మాత్రము ప్రభువు ఎట్లు భక్షించును ? కనుక నీవు ప్రక్కకు తొలగుము. నేను ప్రభువునకు ఆహారమయ్యెదను.'' అనిచెప్పి కథనకుడు సింహము ముందు నిలిచి యిట్లనెను :– "వీరిలో ఎవరుగూడ నీవు భక్షించుటకు అర్హులుగారు. కనుక నన్ను చంపి నా శరీరముతో మీ ఆహారమును నెరవేర్చు కొనుడు. నాకు ఉభయలోక శుభమును చేకూర్చుడు.''

అని చెప్పగానే నక్క, పులి రెండున్నూ చేరి ఆ ఒంటెను గోళ్లతో ఖండించి చంపెను. అందరుచేరి ఆ ఒంటె మాంసమును తృప్తిగా భుజించిరి.

——అని దమనకుడు చెప్పిన కథనువిని సంజీవకుడు–మిత్రమా ! నీచుల సాంగత్యములో నున్న రాజును సేవించుట కష్టము. కనుక ఇప్పుడు నాకు గతియేమి ?

దమనకుడు :– నీవు ఈదుష్ట ప్రభువును సేవించుటకన్న దేశాంతరము పోయి జీవించుట మంచిది.

సంజీవకుడు:– సత్యమే కాని, ప్రభువు కోపించినప్పుడు అతనిని వీడి మరియొక చోటికి పోవుట సాధ్యము కాదు కదా ! అట్లు పోయినను సుఖము ఉండదు. కనుక ఇప్పుడు అతనితో యుద్ధముకన్న మరి ఏదియు నా కిప్పుడు శ్రేయస్కరముకాదు.

ఆ మాటవిని దమనకుడిట్లు చింతించెను :– "ఈ దురాత్ముడు యుద్ధమే చేయుటకు కృత నిశ్చయుడై యున్నట్లు కనపడు చున్నది. అట్లైయెనచో వీని పదునైన కొమ్ములచేత ప్రభువును కొట్టగలడు. అదియు అనర్థమే. కనుక ఇతనికి మరల బోధించి దేశాంతరము పోవునట్లు చేసెదను" అని సంజీవకునితో ఇట్లనెను :– "మిత్రమా! నీ మాట మంచిదే కాని ప్రభువుతో భృత్యునకు యుద్ధము మంచిదికాదు. బలవంతులతో పోరాడుట నాశహేతువగును. పూర్వము టిట్టిభము సముద్రముతో పోరాడి నశించెను. నీకును ఆ గతియే పట్టును." అని చెప్పగా సంజీవకుడు "ఆ కథ యేమో చెప్పుము" అనెను. దమనకుడు ఆ సముద్ర, టిట్టిభముల కథ చెప్పదొడగెను

(సశేషము)



# నాగార్జున కొండపై పురావస్తు ప్రదర్శనశాల

కె. ఆర్. విజయరాఘవన్



పురావస్తు ప్రదర్శనశాల.

(నాగార్జున కొండపై నిర్మించిన పురావస్తు ప్రదర్శన శాలకు కేంద్ర విద్యామంత్రి శ్రీ ఎమ్. సి. చాగ్లా ఈ నెల 23 వ తేది సాయంత్రం 4 గం. 15 ని. లకు ప్రారంభోత్సవం జరిపారు)

నాగార్జున కొండ చరిత్ర ప్రాముఖ్యంగల ప్రదేశంగా మొదటి సారిగా 1926 లో పురావస్తు పరిశోధన శాఖకు చెందిన శ్రీ ఎ. ఆర్. సరస్వతి గుర్తించారు. ఆ తర్వాత అయిదారు సంవత్సరాలు శ్రీ ఏ. హెచ్. లాంగ్‌హర్స్టు అధ్వర్యంక్రింద ఈ ప్రదేశం అంతటా త్రవ్వకాలు జరిగాయి. ఈ త్రవ్వకాల మూలంగా ఇక్కడ అనేక బౌద్ధ స్థూపాలు, బౌద్ధారామాలు, శిల్పాలు బయటపడ్డాయి. ఇంతటి అపూర్వమైన శిల్పాలు, ప్రాచీన కట్టడాలు బయటపడినందు వల్లనే ఇక్కడ పురావస్తు ప్రదర్శనశాల ఏర్పాటు చెయ్యడం జరిగింది. ఈ మ్యూజియమును ఇక్కడనుంచి మార్చవలసిన అవసరం కలిగింది. బహుళార్థసాధకమైన నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం కావడంతో ఈ ప్రాంతమంతా మునిగిపొయ్యే ప్రమాదం ఏర్పడింది. అందువల్ల దీనిని కొండపైకి మార్చడం జరిగింది.

నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణంతో ఈలోయ అంతా ముంపుకు లోనయ్యే ప్రమాదం కన్పించడంచేత ఇక్కడ మరింత శీఘ్రంగా, పెద్దఎత్తున త్రవ్వకాలు జరపవలసి వచ్చింది. ఈ పని డా॥ ఆర్. సుబ్రమణ్యం ప్రారంభించారు. ఆ తర్వాత శ్రీ టి. ఎన్. రామచంద్రన్ అజ్మాయిషీ క్రింద త్రవ్వకం పని శీఘ్రంగా కొనసాగింది. ఇందుమూలంగా అతి పురాతనమైన అనేక చారిత్రాత్మకమైన ప్రదేశాలు, నిర్మాణాలు బయటపడ్డాయి. ఇటీవలి త్రవ్వకాలలో పాతరాతియుగం నాటి పాత్రలు మొదలైనవి లభించాయి. దీనితో నాగార్జునకొండ చరిత్ర ఆదినుంచి అంతందాకా అన్ని విషయాలూ తెలుసుకోడానికి అవకాశం కలిగింది. క్రీ. శ. 2 వ శతాబ్దంలో ఇక్ష్వాకుల పరిపాలనా కాలంలో ఈ ప్రాంతం అన్నివిధాలా ఉచ్ఛదశ అందుకొన్నది. ఆ కాలంలో ఇది విజయపురి పేరిట ఇక్ష్వాకుల రాజధానిగా వెలిసింది. ఇక్ష్వాక వంశానికి చెందిన రాణులు మహాయాన మతాన్ని ఆదరించి బౌద్ధారామాలను నిర్మించారు. బౌద్ధసన్యాసులకు నాగార్జున

కొండ వైశిష్ట్య క్షేత్రంగా మారిపోయింది. మత విషయకంగానే కాకుండా కళా వైభవానికికూడా నాగార్జునకొండ ప్రసిద్ధి గాంచింది. దేశంలో వివిధ ప్రాంతాల నుండేకాక విదేశాల నుంచికూడా బౌద్ధసన్యాసులు ఇక్కడకు వస్తూఉండే వారు. శాతవాహన రాజులలో చివరి రాజుల కాలంలో అమరావతిలో ప్రారంభమైన నూతన శిల్పరచనా పద్ధతి క్రమంగా ఇక్ష్వాకుల కాలంనాటికి మార్పుచెంది క్రొత్త నైపుణ్యం సంతరించుకొన్నది. ఇచ్చటి శిల్పాలు సర్వ ప్రపంచాన్ని పరవశింప చేయగల అపురూప కళాఖండాలు. ఇచ్చటి స్థూపాలపై ఎక్కువగా జాతకథలు, బుద్ధుని జీవితంలో కొన్ని సంఘటనల తాలూకు దృశ్యాలూ చిత్రింపబడ్డాయి. అక్కడక్కడ బుద్ధుని కాలం నాటి సాంఘిక పరిస్థితులను గురించి వివరించే దృశ్యాలు కూడా పీటిపై చిత్రీకరించడం జరిగింది. అయితే దురదృష్టవశాత్తు ఇవి ఏవీ కూడా ఏక ఖండంగా లభించలేదు. ముక్కలుముక్కలుగా లభించాయి. అప్పటి శిల్పకళా సాంప్రదాయానికి అనుగుణంగా జాగ్రత్తగా ఒక దగ్గర చేర్చి రూపకల్పన చెయ్యవలసి వచ్చింది. కొన్ని చోట్ల శిథిలమైపోయిన భాగాలను క్రొత్తగా చెక్కించవలసి వచ్చింది.

క్రీ. శ. 3 వ శతాబ్దినాటి శాసనాలుకూడా ఇక్కడ లభించాయి. బ్రాహ్మిలిపిలో, ప్రాకృత భాషలో వ్రాసిన శాసనాలివి. క్రీ. శ. 3 వ శతాబ్దంనుంచి దాదాపు మధ్యయుగం వరకు వివిధ కాలాలకు చెందిన శాసనాలు ఇక్కడ లభ్యం



ఒక శిల్ప ఫలకము



మ్యూజియంలో కేంద్ర విద్యా మంత్రి

అయ్యాయి. ఇక్కడ జరిగిన త్రవ్వకాలలో ఆనాటి స్త్రీలు ధరించిన నగలదగ్గరనుంచి రాజులు ముద్రించిన నాణెముల దాకా అనేక రకాల వస్తువులు లభించాయి. ఇక్ష్వాకుల పరిపాలన అంతమైనతర్వాత ఈ విజయపురి వైభవం క్రమంగా తగ్గిపోయింది. ఆ తర్వాత ఈ ప్రాంతాన్ని విష్ణుకుండినులు, పల్లవులు, చాళుక్యులు, విజయనగర రాజులు జయించి పాలించారు. ఆ తర్వాత గోలకొండ నేలిన కుతుబ్‌షాహి వంశజులు ఈ ప్రాంతాన్ని జయించారు. మధ్యయుగానికి చెందిన మహిషాసురమర్ధని, యోగనరసింహ, జైన తీర్థంకరాది దేవతా విగ్రహాలు కూడా ఇక్కడ లభించాయి.

ఈ ప్రాంతం ప్రాజెక్టు నిర్మాణంలో మునిగిపోతుంది కనుక ఈ పురావస్తు ప్రదర్శనశాలను కొండపైకి మార్చాలని శ్రీనెహ్రూ సూచించారు. తదనుగుణంగా నిర్ణయాలుతీసుకోవడం జరిగింది. కొండమీద 1959 లో మ్యూజియం నిర్మాణంను ప్రారంభించారు. సుమారు ఆరు సంవత్సరాలలో ఈ మ్యూజియం నిర్మాణం పూర్తిఅయ్యింది. ఈ ప్రాజెక్టు పూర్తిఅయితే నాగార్జునకొండ ఒక ద్వీపంలా ఉంటుంది. దేశంలో ఇటువంటిచోట కట్టిన మ్యూజియం ఇది ఒక్కటే.

ఈ మ్యూజియంలో అత్యంత ఆధునికమైన పద్ధతులలో పురాతన వస్తువులను ప్రదర్శనకు పెట్టడం జరిగింది. ★

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

మే 18 : 18వ ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర విద్యావిషయిక వార్షిక సమావేశం గుంటూరులో ప్రారంభమైంది.

జూన్ 6 : ఆధునిక పద్ధతుల్లో విత్తనాల ఉత్పత్తికి సంబంధించిన శిక్షణ కార్యక్రమానికి రాజేంద్రనగర్‌లో రాష్ట్ర ఆహార వ్యవసాయ మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## భారతదేశంలో

మే 16 : ఆకాశవాణి రేడియో వ్యవహారాల పరిశీలన నిమిత్తం నియమింపబడిన చాందా కమిటీ నివేదిక పార్లమెంటుకు సమర్పించబడినది.

మే 18 : లోకసభ నిరవధికంగా వాయిదా పడినది.

మే 19 : రాజ్యసభ నిరవధికంగా వాయిదాపడినది.

జూన్ 1 : మొత్తం 488 లక్షల డాలర్ల ఋణాన్ని భారత దేశానికి అమెరికా అందజేసే ఒప్పందాలు రెండింటిపై అమెరికా, భారత దేశాలు సంతకాలు చేశాయి.

జూన్ 5 : రూపాయి విలువను 36.5 శాతం తగ్గిస్తూ భారత ప్రభుత్వం ఒక ప్రకటనను జారీచేసింది.

జూన్ 8 : సైనిక ప్రధానాధికారిగా జనరల్ పి. పి. కుమారమంగళం పదవిస్వీకారం చేశారు.

## విదేశాలలో

మే 23 : నౌకాసిబ్బంది సమ్మె కారణంగా అత్యవసర సర్వీసులకు ఏవిధమైన యిబ్బంది కలుగకుండా ఇంగ్లాండు అంతటా అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది.

జూన్ 2 : అమెరికా ప్రయోగించిన 'సర్వేయర్' వ్యోమనౌక చంద్రుని ఉపరితలంపై విజయవంతంగా చేరింది.

జూన్ 3 : ఐర్లాండ్ అధ్యక్షుడుగా ఈమన్ డీ వెలరా తిరిగి ఎన్నికయ్యారు.




EDITED AND PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD-24

